# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-1-1979 | సంచిక 5




—* ఈ సంచికలో *—



16—1—79 సంచికలో వేణీసంహారము – నాయకుడు, సాహిత్యంలో హేమంతం, తాత్త్వికనవల మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై

# మోక్షశాస్త్రంలో కామశాస్త్రం

— శ్రీ కపిలవాయి లింగమూర్తి.

చతుర్వర్గములో ధర్మార్థాలు మొదటి జంటగా, కామమోక్షాలు రెండవ జంటగా కనిపిస్తాయి. అయితే ఈమలి జంటలో కామం మోక్షానికి ప్రతిబంధకమా! అనే సమస్య మానవుడు పుట్టి బుద్ధి ఎరిగిననాటినుండి బాధిస్తున్నది. దీన్ని శ్రీకృష్ణుడు గీతలో 'ధర్మావిరుద్ధో భూతా శాం కామోస్మి భరతర్షభ' అని పరిష్కరించాడు.

'నిజానికి కామమోక్షాలు పరస్పరవిరుద్ధాలు గావు. మోక్షానికి కారణమైన భక్తి శృంగారానికి చెల్లెలు. ఆరెండింటికి తల్లి ఒక్కటే. కాంతావిషయకమైన రతి శృంగారమైతే భగవద్విషయక రతి భక్తి అయింది. ఈ సత్యాన్ని చాటటానికే కాబోలు భాగవతం భక్తిరస ప్రధానమైనా పోతనగారు దానికి శృంగారాన్ని అంగంగా చేశాడు.

భాగవతకథలన్నింటికి గజేంద్రమోక్షణం తలమానికంగాబట్టి దానిలో శృంగారం ఏవిధంగా చోటుచేసికొందో ఈ వ్యాసంలో చూపిస్తాను.

లౌకిక మైన కామం కావ్య ప్రపంచంలో శృంగార మనే రూపాన్ని పొందింది. దానికి వసంతం ఉద్దీపనకాలం. గజజాతి శిశిరంలో క్రొవ్వి వసంతం రాగానే కరేణువులతో విహారానికి పూనుకుంటుంది. అందువల్ల ఈ ప్రకృతి సత్యాన్నెరిగిన పోతనగారు గజేంద్రుని విహారానికి మొదట త్రికూట పర్వత వర్ణనలో వసంతాన్ని ప్రదర్శించారు.

ఈనాడు వసంతం మేషసంక్రమణంలో ఆరంభమైనా ఒకప్పుడది మకర సంక్రమణంలోనే ఆరంభమయ్యేది. ఈ రహస్యాన్ని పోతనగారు గజేంద్రుని సలిల విహారారంభంలో 'ఇభలోకేంద్రుడు' అనే పద్యంలో, 'నక్రగ్రాహ పాఠీనముల్' అని, మకరితో పోరేసందర్భంలో 'జవమును జలమును' అనే పద్యంలో 'దివి మకర మీన కర్కట' అని ఈరెండు చోటులలో జలజంతువులను మకరాదిగా చెప్పటలో సూచించాడు.

జీవునికి శృంగారం ఆత్మధర్మం. దాని భౌతికస్వరూపం సౌందర్యం. అందువల్ల గజేంద్రుని శృంగార లీలలను చెప్పదలచిన పోతనగారికి అతని సౌందర్యం చెప్పటంగూడా అవసరమయింది. పోతనగారు చెప్పిన ఈ గజేంద్రుని సౌందర్యాన్ని చూడండి.

తనకుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల
కుచముల పయ్యెద కొంగులీగ!
తనయానగంభీరతకు నోడి యబలల
యానంబు లందెల నండగొనగ!
తనకరశ్రీగని తలకి శాలలచిఱు
తొడలు మేఖలదీప్తి తోడుపిలువ
తనదంతరుచి కోడి తరుణులనగవులు
ముఖచంద్రదీప్తుల ముసుగు దిగువ
తనదులావణ్యరూపంబు తలచి చూచి
అంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర
దయితలందరు తనవెంట దగిలినడువ
కుంభివిభు డొప్పె నొప్పులకుప్ప వోలె!

'మానవ కాంతల ముఖదరహాసదీప్తులతని దంతకాంతికి సరిరాక ముసుగువేసికొన్నవి. కుచములు కుంభాలకు సరిరాక పయ్యెదచాటున ఈగినవి. ఊరువులు కరశ్రీకి సాటిరాక మేఖలాదీప్తిని తోడుచేసికొన్నవి. యాన మతనిగంభీరతకు సాటిరాక అందెల నండగా గొన్నది'.

ఈ గజేంద్రుడు పశువైనప్పటికీ అతని సౌందర్యం మానవ సౌందర్యాన్నే తలదన్నింది. ఈ పద్యంలో పోతనగారు మానవకాంతల సౌందర్యంకోసం గజేంద్రుని నుండికొల్లగొట్టిన ఉపమాసామగ్రి అపూర్వం. అతడు వర్ణించిన ఈ గజేంద్రుడు నలకూబరులకోటిలోనివాడు. నలుడు మానవుడైనప్పటికీ అతన్ని దేవతాస్త్రీలందరు వలచినట్లు ఈగజేంద్రుని సౌందర్యానికి వశలై అంజనాదిదిగ్గజకాంతలంద రతని వెంట నంటారు.

లోకంలో రూపసంపద స్త్రీలకే గాదు, పురుషులకుగూడా కీడును గలిగిస్తుంది. సుకుమారాదు లనన్యరూపసంపద గలవారు గనుకనే వారినిజూచిన యువతులందరు వలచివలపించి పతితులను చేశారు.

ఈగజేంద్రుడుగూడ అపురూపపురూపసంపద గలవాడు. అందుచేత కరేణువుల బలగమంతా అతనివెంట చేరింది. ఆబలగంతో క్రీడించటంవల్ల అతడుపిపాసాయత్తుడైనాడు. దానితోచిత్తంస్వాయత్తత తప్పింది. అందుచే అతడు తనమందను విడిచి మరోత్రోవ పట్టాడు. ఈత్రోవలోనే అతనికి తానుపట్టుపడిన మడుగ కనిపించింది. గజేంద్రుడు ఆసరస్సులో కేవలం నీరు మాత్రమే త్రాగితే కథ లేదు. కాని గజేంద్రుని సౌందర్యం దిగ్గజకాంతలందరినీ ఆకర్షిస్తే ఆ సరోవర సౌందర్యం అతనినే ఆకర్షించింది.

మానవు డింద్రియసంయమనంకోసమై సంసారం చేయటంలో దోషం లేదుగాని యింద్రియలాలసత్వం కోసంచేస్తే దోషమవుతుంది.

గజేంద్రుడు చూచిన సరస్సీలా ఉంది.

తోయజగంధంబుదోగిన చల్లని
మెల్లనిగాడ్పుల మేను లలర
కమలనాళాహార విమలవాక్కుల హంస
రవములు సెవుల పండువులు సేయ
ఫుల్లదిందీవ రాంభోరుహామోదంబు
ఘ్రాణరంధ్రంబుల గౌరవింప
నిర్మలకల్లోల నిర్గతసారంబు
వదనగహ్వరముల వాడుదేర్ప
త్రిజగ దభినవ సౌందర్యదీప్తమైన
విభవ మీక్షణములకును విందుసేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను
మఱచిమత్తేభయూథంబుమడుగుసొచ్చె!

సరస్సును చూడగానే గజేంద్రుడు సర్వేంద్రియ వ్యాపారాన్ని మరచి దానిలో ప్రవేశించాడు. అతనితోపాటతనిబలగంగూడ సరసిలో దిగింది. తన ప్రియురాండ్రతో సలిలవిహారంచేసే గజేంద్రుని పోతనగారీవిధంగా వర్ణించాడు.

కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటదోగి
సెలయేటినీలాద్రి చెలువుదెగడు
హస్తినీహస్తవిన్యస్త పద్మంబుల
వేయికన్నుల వాని వెరవుసూపు
కలభీసముత్కీర్ణ కల్హారరజమున
కనకాచలేంద్రంబుఘనత గాంచు
కుంజరీపరిచితకుముదకాండంబులు
ఫణిరాజమండనప్రభ వహించు
మదకరేణుముక్త మౌక్తికశుక్తుల
మెఱుగుమొగిలుతోడ మేలమాడు
ఎదురులేనిగరిమ నిభరాజమల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు

ఈగజరాజు సల్పినజలక్రీడ ఏకావ్య నాయకులకు తీసిపోదు. పోగా పోతనగారీపద్యంలో "వనజగేహకేళివ్రాలుట" అనే పదబంధాన్ని సరసమైన ధ్వని మర్యాదనెరిగి ఉపయోగించాడు. అంతే కాక ఆకేళిలో కలగినసరస్సును–

"మరియు నా సరోవరలక్ష్మి మద గజేంద్రవిహారణ వ్యాకులిత, నూతన లక్ష్మీవిభవయై, యనంగ విద్యానిరూఢ పల్లవప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమకోమలియుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధుకరయు, విగళిత రస వదనకమలయు, నిజస్థానచలితకుచరథాంగయుగళయు, లంపటితజఘనపులిన తలయునై యుండె నంత"– అని వర్ణించాడు.

(తనసౌందర్యమే తనశత్రువని యిక్కడ మరోసారి ఋజువయింది.)

పోతనగారి కళాశాస్త్ర విజ్ఞానాని కీవచనం ఓ చక్కని నిదర్శనం. ఆయన ఈ కథలో శృంగారాన్ని అంగంగా స్వీకరించటం ఈవచనంలో స్పష్టంగా కనిపిస్తుంది. దీనిలో అతడు గజేంద్రుని నాయకునిగా, సరోవరాన్ని నాయికగా రూపించి సృజించిన శృంగారం పండితైక వేద్యం. దాన్నిక పరిశీలించండి.

ఈ వచనానికంటె మొదట పోతనగారు సరస్సుకు కాసారపద్మాకరపర్యాయాలు, ఏనుగుకి కుంభి శబ్దంవాడాడు. ఇది వచనంగాబట్టి పర్యాయాలు మార్చటానికి గణభంగసమస్య రాదు. కాని కాసార పద్మాకరశబ్దాలు పుంలింగాలు. కుంభి స్త్రీలింగస్ఫూర్తిగల శబ్దంకాబట్టి వానినాలాగే ఉంచితే పేడికి దారవలె ఆరోపసౌందర్యం చెడుతుంది. అంగువల్ల అవిమార్చి సరోవరానికి స్త్రీలింగమైన సరసీశబ్దాన్ని, ఏనుగుకి పులింగమైన గజ శబ్దాన్ని ఎత్తుకొని మొదట వాని నాయికానాయకత్వాన్ని నిలిపాడు.

ఈనాయిక సరోవరకన్య– అది నిర్గత కల్లోలసారం. కల్లోలిని అంటే నది. నదీ భర్త సముద్రుడుగాబట్టి ఈ సరోవర గజ దాంపత్యం నళినీ భాస్కరులకువలె కవి సమయబద్ధంగాదు.

పురాణప్రసిద్ధి ననుసరించి యింద్రపదవిని మొదట నధిష్ఠించినవాడు విష్ణువే. ఆ కారణంగా లక్ష్మి మొదట శక్రసంపద. ఆ సంబంధాన్ని పురస్కరించుకొని ఇక్కడ సరోవరాన్ని లక్ష్మిగా గజాన్నింద్రునిగా కూడా సూచించాడు. అయినా ఈ దాంపత్యంగూడా లోకప్రసిద్ధంగాదు. పారదారికంగా భాసిస్తుంది. అయితే పోతనగారి శృంగారాని కంగంగా చెప్పినది మరొకటిఉంది. అది భ్రమర శృంగారం. దాన్నొక పర్యాయం పరిశీలించండి –

తేటియొకటి యొరుప్రియకును
మాటికి మాటికిని నాగమదజలగంధం
బేటి కని తన్ను బొందెడి
బోటికి నందించు నిందు బోటిదనమునన్.

ఈభ్రమరశృంగారాన్ని సరోవరలక్ష్మి గజేంద్ర శృంగారానికి సూచనగా గ్రహిస్తే అది పారదారికంగాదు కాబట్టి అదికాదనే అనవలసి ఉంటుంది. మరేమన ఈ సరోవరకన్య పతిని చేరలేక మధ్యే మార్గంలో నిలచిపోయిన యువతి. గజేంద్రు డామెకు యాదృచ్ఛికంగా తటస్థపడిన రసికుడు.

ఈ సరోవరలక్ష్మి అనన్య పురుష సంచార. నిష్కళంక! మరియు కుసుమ కోమలి.

పోతనగారీసరోవరాన్ని "కోమల పంకజములు"గల దని చెప్పాడు. కోమల శబ్దానికి నానార్థాలలో నీరు గూడా

(తరువాయి 5 వ పేజీలో)

# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

– శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

కావ్యానందము:_ఇది 292 పుటలుగలిగి 26 విభాగాలుచేయబడిన గ్రంథం. సరస్వతి, భాష, విచిత్రమైన పరిణామము, పాశ్చాత్యనాగరికత భారతీయ సంస్కృతి, నేటి కాలము_ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానము, మానవుడు_దుఃఖములు, అనుభూతిరహస్యము – ఆనందచర్చ, రసస్పర్శ, భావస్పర్శ ఆనందస్వరూపము, అనుభవలక్షణము, బహ్మానందము – రసానందము, భావస్వరూపము, నాలుగు దశలలో మానవుడు – లోకప్రవృత్తి, కవికల్పన, ఆనందము, లోకము, రససిద్ధి, కథాతత్త్వము, రసములు – హృదయములు, భావుకుడు_రసోద్వేగః, హాస్యము, శాంతము, రసములెన్ని ? కవి రసదృష్టి, స్వయంభువు అను ప్రకరణము లున్నవి. అద్వితీయమైన విశ్వనాథవారి శాస్త్ర పాండిత్యానికి కిది యొకనికషోపలం.

దీనికి వారే వ్రాసుకున్న పీఠికలో కావ్యానందము నిజముగా ననుభవించినచో నట ఒక్కటే యాయానందములోని యొక సూక్ష్మదేశము. దీనిని మానవుడు యోగముచేత పొందవచ్చును. యథార్థమైన కావ్యము యథార్థదృష్టితో శిల్పపరిజ్ఞాతయై భిన్న కావ్యగుణములు వివిచ్యమానముగా చక్కగా తెలిసినవాడై, దురభిమానములు లేనివాడైనచో, తెలుగు కావ్యమైనచో మహాకవులైన పూర్వాంధ్ర సంస్కృత కవులను అక్షరశః తెలిసి గ్రహించిన వాడైనచో, మరియు పరమేశ్వరుడు వాని హృదయము నందు తన్మయీ భవనయోగ్యత కల ఆర్ద్రత సమకూర్చి పెట్టినచో వాడు కావ్యానందమును పొందును. వాడు రసానుభూతి పొందును. ఇదియద్వైత సిద్ధాంతము. నిత్యమైన యాత్మయొక్క లక్షణము.’ అని తెలిపినారు.

ఈగ్రంథంలో విశ్వనాథవారు సోదాహరణంగా, రమ్యమైన శైలిలో చేసిన శాస్త్రవిషయకమైన చర్చ అనన్యసామాన్యము. వారే విషయం చర్చించినా భారత దేశంలో అనాదిసిద్ధంగా ఉన్న సిద్ధాంతాలను ఆధారం చేసుకుంటారు. కాబట్టి వారి విమర్శనాధోరణిని అర్థం చేసుకోవాలంటే ముందుభారతదేశ సంప్రదాయాలూ సిద్ధాంతరాద్ధాంతాలు ఆకళింపు చేసుకోవాలి. లేకపోతే నేలవిడిచి సాముచేసిన ట్లనిపిస్తుంది.

‘అనుభూతి రహస్యము_ఆనందచర్చ’ అనే భాగంలో సారస్వతానికి సంబంధించినంతవరకూ సుఖమే కాని దుఃఖం లేదనీ, పూర్వ కావ్య పరిశ్రమవల్ల ఆనందం లభిస్తుందనీ అదే రసమనీ, కరుణ హృదయుడికీ, పూర్వజన్మ సంస్కారవంతుడికీ సారస్వతంలో ఆనందానుభూతి కలుగుతుందనీ అంటారు విశ్వనాథ. ఇచ్చట పూర్వజన్మ సంస్కారాది విషయాలలో ఆయన కున్న గాఢవిశ్వాసం కొట్టవచ్చినట్లు కానవస్తుంది.

‘రసస్పర్శ’ అనేభాగంలో సంగీత సాహిత్యాలకు గల సామ్యవైషమ్యాలను చర్చించి భావము కాలము నాశ్రయించుట అనేది సంగీతంలో అధికమనీ, కావ్యపఠనంలో, కావ్యశ్రవణంలోతక్కువనీ వివరించారు.

ఆలాగే కామం ఆత్మపదార్థమైన చైతన్యంలోని ఒక కదలిక అనీ ఇట్టి కదలికలు చాలఉన్నా యనీ, ఈకామాన్ని నెమ్మదిగా వడియగడితే, దోషాలు తొలగించగా ఏర్పడిన వైభవంపేరు కావ్యరచన అనీ, అనుభవం పేరు శృంగారరసమనీ అందుకే రసము సర్వధా సామాజికనిష్ఠ మనీ తెలియచేశారు విశ్వనాథ.

ఆనందం పొందడం ఇంద్రియాతీతలక్షణం, అనుభూతి అనీ ‘కీట్సు’ నిజమైన అనుభవాన్ని పొందలే దనీ, శ్రీరాముడు ‘విని శ్చేతుం శక్యో న సుఖ మితి వా దుఃఖ మితి వా...’ అనడంలో సీతాపరిష్వంగ సుఖం సంపూర్ణంగా అనుభవించాడు అనీ సోదాహరణంగా చర్చించారు.

ఈ అనుభవలక్షణాన్ని గూర్చి తెలుపుతూ యోగి మనస్సుకూ, భావుకుడైన కావ్య పాఠకుని మనస్సుకూ ఉన్న భేదం వివరించారు విశ్వనాథ. యోగి, మనస్సనకూ ఇంద్రియాలకూ మధ్య నున్న తలుపును మూసివేయడంవల్ల మనస్సు చైతన్య భూమి,లోనికి పోవును. అది యానంద భూమి చీకటి లేదు. విచిత్రముగా నుండును. కావ్యపాఠకుని మనస్సుకూ ఇంద్రియాలకూ మధ్యనున్న తలుపు మూయబడలేదు కాబట్టి అతని మనస్సు చైతన్య భూమిలోకి పోయినా వెంటనే తిరిగి వస్తుంది. కావ్యపాఠకుడి మనస్సుగలవాడవడంవల్ల తేలికగా బ్రహ్మానందాన్ని పొందుతున్నాడు.

జీవుడు సంస్కారసంపుటి, ఆ జీవుని యందు సంస్కారము లన్నియు తొలగించినచో ఆజీవుడు చైతన్యము. అనగా విజ్ఞానమయ బ్రహ్మముయొక్క ప్రతిబింబము. మహాప్రళయమందలి బ్రహ్మచైతన్య మెట్టిదో యట్టివాడు విజ్ఞానమయ బ్రహ్మము. లోకదృష్ట్యా యేకదేశము అలోకదృష్ట్యా సర్వదేశము. ఇది యద్వైతము. కావ్యానందము. తన్మహాచైతన్యములోని భాగము,ఆనందము దానిలక్షణము’ అని ‘రససిద్ధి’ అనే భాగంలో సత్యనారాయణగారు చేసిన వివరణ చూసినచో ఆయనవిమర్శ జీవునిమూల తత్త్వానికి పోయి అక్కడినుంచీ క్రమానుగతంగా నిర్మించుకుంటూ వచ్చిన ఒక సౌధంలా కనిపిస్తుంది. ఇది భారతీయ

తత్త్వశాస్త్రరహస్యాల సారం కరతలామలకంగా ఉండి చేసిన విమర్శ కాని అన్యం కానేరదు.

ఆనంద మనునది యెట్లు సముద్భూతమగును? అని ప్రశ్నించుకొని, నిర్వ్యాజమైన యాలోచనచేత, జీవలక్షణములైన భావములు త్రవ్వికొనుటచేత, ఆయూహను శోషింప జేయుటచేత ... గాఢ మనన శీలత్వముచేత, మనస్సునందు గుంట పడునట్లు చేయుదానిచేత, ఆ యడుగున నున్న విజ్ఞానవాపీజలదర్శనము చేయించుదానిచేత (పే218) నని సమాధానం చెప్పినారు విశ్వనాథ తమ సహజ ధోరణిలో.

విశ్వనాథవారు రసములు ఎనిమిదనియే ఈ గ్రంథంలో నిరూపించారు.

నిజమైన భావుకుడు సదసద్వివేచనా చతుర మతియై ఉండాలని విశ్వనాథవారి ఆకాంక్ష.

కావ్యపరిమళము :- శ్రీనాథుడు, సోమన, పెద్దనాది మహాకవుల ప్రబంధాలలో విశేషాలను గూర్చి విశ్వనాథ ఈ గ్రంథంలో సోదాహరణంగా వివరించారు. సాహిత్య సురభి :- ప్రబంధాలతోపాటు భారత భాగవతాలలోని కొన్ని ప్రసిద్ధ పద్యాలను తీసుకొని మనోహరమైన శైలిలో వ్రాసిన వ్యాఖ్యలున్నాయి ఈ పుస్తకంలో. అయితే ఈ రెండు గ్రంథాలలోనూ క్రమానుగతంగా పద్యాలు కూర్పలేదు.

ఈ గ్రంథాలలో కూడా సత్యనారాయణగారి వ్యాఖ్యానంచేసే ప్రత్యేక శైలిపద్ధతి, లోతైన పరిశీలనా ధోరణి ప్రస్ఫుటమవుతాయి. పూర్వగ్రంథాలపై ప్రబంధాలపై గల విశ్వనాథ దర్శనానికి ఇవి రెండూ ప్రదర్శనాలు అని చెప్పవచ్చును.

(సశేషం)

# దిగంబర కవిత్వం ఒక సాహిత్య ఉద్యమం అనవచ్చా?

– శ్రీ డా. పి. ఎల్. నరసింహారావు.

(గతసంచిక తరువాయి)

2) సాహిత్యోద్యమము తత్కాలీన సాంఘిక బౌద్ధిక వాతావరణ జన్యమైన ఒక మహత్తరజీవన దృక్పథం. ఇది సాహిత్య ఉద్యమపు మరొక ప్రధాన లక్ష్యం. ఈ లక్షణం దిగంబర కవిత్వానికి వర్తిస్తుందా? దిగంబర కవులు ప్రతిబింబించిన దృక్పథంలో బౌద్ధికత ఏ మాత్రం వున్నదో తెలియదు కానీ సాంఘికత వరకు తత్పూర్వంలేని ఒక వినూత్నత ఏదీ లేదు. తత్పూర్వమే అభ్యుదయయుగారంభకర్త మహాకవి 'శ్రీశ్రీ' లో ఈ లక్షణాలన్నీ ఉన్నవి. ఆయనలోనే కాకుండా ఆయన్ని తరువాత అనుసరించిన అసంఖ్యాక కవిపరంపరలో సాధారణ దృష్టిగోచరంగా ఉపస్థితమై ఉన్నవే.

కనుక దిగంబరకవులు తెచ్చిన నూతన దృక్పథం ఏదీ లేదు కనుక దానిచేత ఆకర్షితులు అయ్యేవాళ్ళు కానీ దానిని అనుసరించే వారు కానీ ఎవ్వరూ లేకపోయారు. దిగంబరకవిత స్వల్పకాలంలోనే అంతర్ధానం కావటానికి ప్రజలమీద కానీ సాహిత్య పరిసరాలమీద కానీ అది ప్రభావం చలాయించ లేకపోవడమే కారణం. కనుక అది అల్పాయుష్కమై సహజ మరణానికి గురి అయింది. ఇది వుద్యమ లక్షణం కాదు.

3, 4) అంతటి శిఖరాయమాణజీవన దృక్పథసాక్షాత్కారం ఉద్యమకర్తలైన ఏ ఒకరిద్దరు మహాపురుషుల్లోనో ఒక విశాలసామాజిక చైతన్యం దోహద క్రియగా ప్రసవిస్తుంది. ఇంగ్లీషు రొమాంటిక్ ఉద్యమకర్తలైన 'వర్డ్సువర్తు' 'కోలెరిడ్జ్' లను ఉదాహరణగా దృష్టిలో పెట్టుకొనవచ్చును. లేదా కవిత్వంలో మార్క్సిస్టుదృక్పథ నిర్వాహకులైన 'మాయకోవ్‌స్కీ' 'అంద్రే బ్రెతన్', బెర్టోల్ట్ బ్రెష్ట్ ప్రభృతులను గానీ తీసికొంటే, వాళ్ళు కవితోద్యమాల్లో మహాపురుషులు అనవచ్చు. వారి రచనలు ఉద్యమాలుగా మారి ఎందరో నడవడానికి మార్గాలు అయ్యాయి. ఈ లక్షణంతో దిగంబరకవుల్ని వారి కవిత్వాన్ని కొలిస్తే ఫలితం ఏమిటి అని తథాకథిత సాహిత్య విమర్శకులెప్పుడైనా విచారించారా - సాహిత్యవిమర్శ సమాజం పట్ల ఒక బాధ్యతాయుత ప్రవర్తనా లేక బాధ్యతా రహిత విశృంఖల ప్రక్రియా?

దిగంబరకవులు ఐదుగురో ఆరుగురో ఎందరో వారి ఫోటోగ్రాఫులు, వారిఎత్తు, వెడల్పు కొలతలు వారి వయస్సు ఇత్యాది సమాచారం మనం దృష్టిలోకి తీసికొంటే ఈ మూడవలక్షణాన్ని సమన్వయిస్తూ దిగంబరకవిత్వం ఉద్యమమా కాదా అని మరింతసమగ్రంగా పరిశీలించటానికి దోహదం కల్గుతుంది. ఈ దృక్కోణం నుంచి దిగంబరకవుల్ని మరింత విపులంగా పరిశీలించటం వారిని వ్యక్తిగతంగా దూషించటంలాంటి అధమప్రక్రియగా పరిణమించే అవకాశం ఉంది. కనక ఇది త్యాజ్యం. కానీ ఈ అయిదుగురు కవుల్ని మళ్ళీ ఏదోవొక యూనివర్సిటీ వారి B. A పరీక్షకుగానీ లేక హైస్కూలు S S L C పరీక్షకుగానీ కూర్చోబెట్టి ఉత్తీర్ణులు అవుతారా లేదా చూచి వారికి ఈ మహోద్యమ

కర్తవ్యానికి పట్టంకట్టటం సమాజశ్రేయస్సుకు అవసర మనిమాత్రం భావించాలి. ఈ అపరిపక్వయువకషష్ఠాష్టకాన్ని దిగంబర - వుద్యమ కర్తలని పేర్కొనడమే కాక తీవ్రవిప్లవవీరులని కూడా మన అజ్ఞానప్రేరిత తెలుగుసాహిత్యవిమర్శకులు వర్ణించడం మహాశోచనీయం. వీళ్ళు ప్రభుత్వ లేక ప్రభుత్వ సమాన సంస్థల్లో తత్సంబంధమైన క్రమశిక్షణకులోబడి జీవనం గడుపుకుంటున్న అతిసాధారణ వ్యక్తులు మాత్రమే. విప్లవవీరులు జీవితంలో ఎప్పుడూ ఈలాంటి పరిస్థితికి లొంగరు. భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, ఇత్యాది భారతీయులేకాక రష్యన్, చైనిస్ విప్లవవీరుల్ని ఎవ్వర్ని తీసికొన్నా వాళ్ళు రచయితలైనాసరే ఇలాంటిదాస్యవృత్తిలో ఉండడం, అలావుంటూ విప్లవవీరులని వర్ణింపబడడం తెలుగుసాహిత్యవిమర్శలో సాధ్యమౌతుందేకానీ అన్యప్రదేశాల్లో దురూహం. నగ్నముని అనబడే కేశవరావు ఆంధ్రప్రదేశ్ విధాన మండలి కార్యాలయంలో సామాన్య వుద్యోగిగా స్వీయజీవనం గడుపుతాడు. జ్వాలాముఖి అనబడే శ్రీరాఘవాచారి భగవాన్ దాస్ నానక్ రామ్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకుడు. నిఖిలేశ్వర్ అనే మహానాయకుడు వివేకవర్ధని కాలేజీలో హిందీవుపన్యాసకుడు. ఇలా వీరందరి వయోవిజ్ఞానాలు ఎంతపరిమితములో వీరి పుస్తకాలు చదివినా, వీరితో మాట్లాడినా వీరి రచనల్ని అన్యరచయితల రచనలతో పోల్చిచూచినా స్పష్టం అవుతాయి. ఈ పరిస్థితులలో ఈ యువకులను గొప్ప వుద్యమకర్తలుగా విప్లవవీరులుగా చిత్రించటం సత్యదూరం అవటమేకాక సాహిత్యవిమర్శలో బాధ్యతా రహిత ప్రవర్తనగా కూడా పరిగణింపబడుతుంది.

5) సాహిత్యవుద్యమం తత్కర్తల జీవనపరిపక్వతా ఫలితం-దీన్ని గురించి పరిశీలన ఎక్కువగా అక్కరలేదు. కారణం పూర్వగత లక్షణాల క్రింద జరిగిన చర్చే దీనికి సరిపోతుంది.

ఈ విధంగా దిగంబరకవులను వారి రచనల్ని విశ్లేషణాత్మకంగా చూస్తే వారు కవులు ఎంతమాత్రమో మనకు అక్కరలేదు కానీ వారు వుద్యమకర్తలు కావడం మాత్రం అసంభవం. తెలుగు సాహిత్యంలో శాస్త్రీయ విమర్శ లేకపోవడంచేత, సాహిత్య శాస్త్రజ్ఞానులకు పరిణత విమర్శనా చైతన్యం కల్గిన అర్హత వున్నా లేక పోయినా సరే సాహిత్య విమర్శలు, సాహిత్య సమీక్షలు, వర్తమాన తెలుగుసాహిత్య రంగంలో జరుగుతూవుండడం తద్వారా తెలుగుసాహిత్యపు అధోముఖప్రయాణం దినదినప్రవర్ధమాన వేగవంతం కావడం బాధ్యతాయుత పౌరులందరికీ భయాస్పద మౌతూ ఉంది. దిగంబర కవులు Romantic వుద్యమ, అభ్యుదయ వుద్యమ కర్తలంతటి కవులూకారు, మహాపురుషులూ కారు. కనకనే అనతికాలంలోనే దిగంబర కవిత్వం దివంగత కవిత్వమైపోయింది దిగంబర కవిత్వం సాహిత్య ఉద్యమమూ కాదు. గ్రామ సింహం సింహమూ కాదు. వర్తమాన సాహిత్య విమర్శకులు ఆధునిక పాశ్చాత్య సాహిత్య విమర్శనా పద్ధతుల్లో మరింత పరిశ్రమ చేసి పరిణతి గడించి, బాధ్యతా యుతంగా సమీక్షలు వ్రాయటం సమాజానికి శ్రేయస్కర మని చెప్పడం వర్తమానాంధ్ర సాహిత్యంలో ఒక మహత్తర చారిత్రక-అవసరం.

---

( 2 వ పేజీ తరువాయి )

ఒకటి. పంకజాలు కుసుమాలలో చేరినవి కాబట్టి ఈవిధంగా ఈసరోవరం కుసుమకోమలాలు గలిగి కుసుమకోమలిఅయింది.

నాయిక కుసుమకోమలి. కుసుమస్థానం పల్లవాలలోనేకాని పండుటాకులలో గాదు. ఆకారణంగా నాయకుడైన గజేంద్రుని విట భుజంగాది శబ్దాలలోగాక పల్లవశబ్దవాచ్యుని జేసి నాయికా నాయకుల కనురూపత గల్పించాడు.

అనురూపత్వం ఉన్నంతలోనే సరిపోతుందా ! విటునిచేబడ్డ నాయికకు వసివాళ్వాడుట తప్ప నూతన సౌందర్య విభవం శాస్త్ర మంగీకరింపదు. అది లేకుంటే సంభోగంలో శృంగారం లేదు.

లోకంలో మొరటువానిచేత బడుట గాక అనంగవిద్యా నిరూఢునిచే ననుభవింప బడిన యువతి నూతనసౌందర్య విభవురాలగుట ప్రసిద్ధిగనుక పోతనగారిచట గజేంద్రుని సామాన్య పల్లవునిగా గాక అనంగవిద్యా నిరూఢునిగాఁజేసి చక్కని మెలకువ ప్రదర్శించాడు.

నాయిక అనన్య పురుషసంచార-
నాయకుడనంగవిద్యా నిరూఢుడు.
నాయిక కుసుమకోమలి-
నాయకుడు పల్లవుడు
నాయిక లక్ష్మి - నాయకు డింద్రుడు.

ఇక వారి శృంగారం ఎంత రమ్యంగా ఉంటుందో ఊహించండి. ఈ విధంగా భాగవతంలో భక్తికిఅంగంగా సరసమైన శృంగారఘట్టాలను పోతనగారు చాలా చోట్లలో కూర్చాడు. ఈ పర్యాయం మరొకటి చూపిస్తాను.

# ప్రసిద్ధ హిందీకావ్యం "కామాయని" విశిష్టత

( గత సంచిక తరువాయి )

— శ్రీ బి. వి. రమణ, ఎం. ఏ.



'కామాయని' యొక్క కావ్యగత విశేషాలలో ప్రకృతిచిత్రణ అతి ముఖ్యమైనది. కామాయని'లో ప్రకృతి విభిన్న రూపాలలో సాక్షాత్కరిస్తుంది. కావ్యారంభంలో ప్రకృతియొక్క ప్రళయభీకర రూపాన్ని దర్శించవచ్చును.

దేవతల విలాసమయ జీవితంపై కోపించిన ప్రకృతి రౌద్రరూపం దాల్చింది.

పంచభూత కా భైరవమిశ్రణ్
　శంపావోంకే శకలనిపాత్
ఉల్కా లేకర్ అమరశక్తియాఁ
　ఖోజంహీజ్యోంయాంఖోప్రాత్.

'పంచభూతములు భయంకర రూపం దాల్చాయి. శంపాలతలు వినాశాన్ని సూచిస్తున్నాయి. గాఢాంధకారంలో తాముపోగొట్టుకొన్న ప్రభాతకాలవైభవాన్ని అమరులు ఉల్కల వెలుగులో వెదుకుతున్నట్లున్నారు.'

ప్రళయం అనంతరం ప్రకృతిలో ప్రశాంతవాతావరణం ఏర్పడింది.

వహ్ వివర్ణముఖత్రస్తప్రకృతికా
　ఆజ్ లగాహాఁసన్ ఫిర్ సా
వర్షబీతీ హుఆ సృష్టిమే
　శరత్ వికాస్ నయే సిర్ సే

'ప్రళయంవలన భయభీతమైన ప్రకృతియొక్క కాంతివిహీనవదనం మరల మందహాసం చేయసాగింది. వర్షాకాలం గడిచినది. శరత్కాలం వచ్చింది. సృష్టింలో నూతనోత్తేజం వ్యాపించింది.

'ఆశ' సర్గలో నవవధువుగా కనిపించే ప్రకృతికాంత స్వరూపం అతిమనోహరమైనది.

'సింధుసేజపర్ ధరావధూఅబ్
　తనిక్ సంకుచిత బైఠీసే
ప్రళయనిశాకోహల్ చర్ స్మృతిమ్
　మానకియేసే బైఠీసే'

'ప్రళయంతరువాత జలరాశినుండి బయటపడిన భూమి సాగరశయ్యపై ధరావధువు ముడుచుకొని కూర్చున్నట్టుగా ఉన్నది. ప్రళయరాత్రి అనుభవించిన కష్టాలను జ్ఞాపకం చేసికొని దుఃఖభారంతో కుంచుకుకొనిపోయిన వసుధ మొదటిరాత్రి లభించిన నిర్దయతో కూడిన ప్రియుని వ్యవహారమునకు అలిగి కూర్చున్న నూతనవధువులా కానవచ్చింది.

ప్రకృతి చిత్రణతోపాటు సౌందర్య చిత్రణ కావ్య సౌందర్యాన్ని ఇనుమడింప చేసింది.

నిద్రిస్తున్న శ్రద్ధ సౌందర్యం అతి సహజంగా వర్ణించబడింది.

జాగృత థా సౌందర్య యద్యపివహ్
　సోతీధీ సుకుమారీ
రూపచంద్రికామె ఉజ్వలథీ
　ఆజ్ నిశాసీ సారీ
విగతవిచారోంకే శ్రమసీ కర్
　బనేహుయే థే మోతీ
ముఖమండలపర్ కరుణకల్పనా
　ఉన్ కోరహీపిరోతీ.

'అసుకుమారి నిద్రించినా, ఆమె సౌందర్యం మాత్రం చంద్రికాయుక్తమైన నిశాదేవిలా తేజోవంతంగా భాసిస్తున్నది. ఇంతవరకు ఆమె మనస్సులో దాగివున్న ఆలోచనలే ఆమె ముఖమండలం మీద స్వేదబిందువులుగా వ్యాపించాయి. ఎవ్వరో రమణీమణి ప్రశాంతంగా కూర్చొని ముత్యాలసరం కూర్చుచున్నట్టుగానే కారుణ్య భావం ఆమె వదనం మీద వ్యాపించిన స్వేదబిందువులను మాలగా గ్రుచ్చుతున్నది.

'కామాయని' రసప్రధానమైన కావ్యం. శృంగార, వీర, రౌద్ర, వాత్సల్య, కరుణ, శాంత, భీభత్సరసాలు ఈకావ్యంలో మనోహరంగా వర్ణించబడ్డాయి. కవిసంయోగ వియోగశృంగారాలను రెండిటినీ మర్మస్పర్శంగా వర్ణించాడు.

సంయోగ సమయంలోని శ్రద్ధహావభావాలు ఇలావర్ణించబడ్డాయి.

గిరరహీపలకేంఝుకీ థీ నాసికాకీ నోక్
భ్రూలతా కీకాన్ తక్ చఢతీరహీ వేరోక్
స్పర్శకరనేలగీ లజ్జాలలిత కణకపోల్
ఖిలాపులక్ కదంబ సాథా, భరాగడ్
　　　గడ్ బోల్.

'ఆమె కనురెప్పలు మూతపడసాగాయి. నాసికాగ్రభాగం వంగసాగింది. భ్రూలత కర్ణపుటాలవరకు ప్రాకిపోయింది. లజ్జాభావం ఆమె అందమైన చెవులమీద, కపోలాల మీద ఎర్రదనం వ్యాపింప జేసింది. కదంబ పుష్పములా ఆమె మేను పులకించింది వాక్కు గద్గదమయింది.'

మనువుచేత పరిత్యజించబడ్డ శ్రద్ధ యొక్క వియోగావస్థ దయనీయంగా వర్ణించబడింది.

ఏక్ మౌన్ వేదనా విజన్ కే,
  ఝిల్లీకీ ఝనకార్ నహీ
జగతీకా అస్పష్ట ఉపేక్షా,
  ఏక్ కసల్ సాకార్ రహీ
హరిత కుంజకీ ఛాయాభర్ థీ,
  వసుధా ఆలింగన్ కరతీ
యహ ఛోటేసే విరహ నదీథీ,
  జిన్‌కా హై అబ్ పార్ నహీ.

'కీచురాళ్ళ ధ్వనికూడా వినిపించని ఆ నిర్జనప్రదేశపు వాతావరణమంతా నిస్తబ్ధత వ్యాపించినట్లే, శ్రద్ధ జీవితంలో కారుణ్యభావం మౌనంగా ప్రసరించసాగింది. విశ్వ ఉపేక్షిత శ్రద్ధ మూర్తీభవించిన వ్యథలా ఉన్నది. పృథ్విని ఆలింగనం చేసుకొనే పచ్చనిలతా-కుంజపు ఛాయలా భూమిపై పడిఉన్నది. అపార విరహతరంగిణిలా కానవస్తున్నది.'

'కామాయని' లో ప్రయోగించబడిన వివిధ శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు అసంఖ్యాకములు. ఈ కావ్యంలో కనిపించే ఉపమాన విన్యాసం కవికులగురువు కాళిదాసు ఉపమాన కౌశలాన్ని గుర్తుకు తెస్తుంది.

ఈ క్రింది పద్యాలు ఇందుకు ఉదాహరణాలు.

ఉధర్ గరతీ సింధులహరియా
  కుటిలకాల్ కే జాలోంగీ
చలీ ఆరహీ ఫేన్ ఉగలతా
  ఫన్ ఫైలాయె వ్యాలోంగీ

ప్రళయకాలంలో సాగరతరంగాలు పడగ విప్పి విషపు నురగ క్రక్కుతున్న సర్పరాజులా హుంకరిస్తున్నవట.

ఘిర్ రహేథే ఘుంఘురాలేబాల్
అసఅవలంబిత ముఖకేపాస్
సుధాభర్ నేకో సిధుకేపాస్

శ్రద్ధ భుజస్కంధముల పై వ్రేలాడుతున్న నల్లనికురులు చిరునగవుతో కూడిన ఆమె అందమైన వదనాన్ని చుట్టుముట్టి, అమృతపానమునకై చంద్రుని సమీపించిన నీలినీరద ఖండమాలికలలా కానవస్తున్నవట.

ఇట్టి ఉపమానాలు కోకొల్లలు.

జయశంకర ప్రసాద్ ఛాయావాదానికి చెందిన కవి. హిందీలోని ఛాయావాదకవిత (భావకవిత) కు సంబంధించిన ధ్వన్యాత్మకత, చిత్రమయత, లాక్షణికత, మానవీకరణ 'కామాయని' లో విరివిగా కనిపిస్తాయి.

కవి అనేక చోట్ల మానవీకరణ ద్వారా జడప్రకృతికి చైతన్యగుణాన్ని ఆరోపించాడు. ఉదాహరణకు,

'ధీరేధీరే హిమ ఆచ్ఛాదన్
  హటన్‌లగా ధరాతలసే
జగీబనస్పతియా అలసాయీ
  ముఖధోతా శీతలజలసే

'భూమిపై వ్యాపించి ఉన్నమంచు నెమ్మదిగా కరగ సాగింది. అంతవరకు, దట్టమైనమంచుతో కప్పబడిన చెట్లు, చేమలు, దీర్ఘనిద్రానంతరము, శీతల జలంతో ముఖమార్జనం చేసుకొంటున్నట్టుగా కనిపించాయి.'

'కామాయని' లో కనిపించే లాక్షణిక ప్రయోగాలు అనేకం. ఉదాహరణకు.

పగలీ హాసంభాల్ లేకైలాసే
  ఛూట్ పడా తేరా అంచల్ ?
దేఖ్ బిఖరతీహై మణిరాజీ
  అరఉరా బేసుధ చంచల్

'నిండు యౌవనంలో మత్తెక్కిన ఓ రజనీ! నీపైటచెంగు జారిపోయింది, సర్దుకో. చెల్లాచెదరైపోతున్న ఆమణులను ఏరుకో। 'ఇక్కడ పైటచెంగు ఆకాశాన్ని, మణులు తారలను సూచిస్తున్నాయి.

'కామాయని' ప్రబంధకావ్యం. మహాకావ్యానికి కావలసిన లక్షణాలన్నీ ఈ కావ్యంలో ఉన్నాయి. కావ్యం సర్గబద్ధమైనది. మానవవికాసానికి సంబంధించినది కనుక ఇతివృత్తం మహత్తరమైనది. కావ్యనాయకుడు మనువులో ధీరోదాత్త నాయకుని లక్షణాలు కనిపిస్తాయి. కావ్యంలోని శృంగారాది రసాలు సహృదయుల హృదయాలను అలరింపజేస్తాయి కావ్యం ఆద్యంతం ప్రకృతివర్ణనలతో నిండి ఉన్నది. వివిధ అలంకారాలు, ధ్వని, లాక్షణికత, మాధుర్యాదిగుణాలు, కావ్యానికి శోభను చేకూర్చాయి. జీవన సాఫల్యానికి అవసరమైన సామరస్య సాధనను గురించి తెలపటం కావ్యప్రయోజనం. డా॥ నగేంద్రగారు చెప్పినట్టు 'సమకాలీనమైనప్పటికీ, సర్వకాలాలకూ సంబంధించిన; స్వదేశీయమైనప్పటికీ, సర్వదేశాలకూ సంబంధించిన; ఈ లక్ష్యసాధనద్వారా 'కామాయాని'కి మహాకావ్యత్వం సిద్ధించింది'

చివరగా కవి 'సుమన్'గారి మాటల్లో చెప్పాలంటే 'కామాయని జీవితమథనం ద్వారా లభించిన అమృతం'.

(గతసంచిక ఈ వ్యాసానికి చెందిన ఫుట్‌నోటులో రామాయణంలో రూపకత్త్వం - అనుదానికి బదులుగా కామాయనిలో రూపకత్త్వం అని ఉండాలని గమనింపగోరిక. - సం.)

— ... —

# కద్రూ వినతల ఘట్టము - కొన్ని ప్రసన్న విశేషాలు

- భాషాప్రవీణ శ్రీ మైలవరపు శ్రీనివాసరావు, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

1. కరిమకర నికరాఘాత జాతవాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారాచ్ఛాదితగగనతలంబైనదాని,

2. ఉద్యానవనంబుబోలె బహువిద్రుమలతాలంకృతంబైన దాని.

3. నాటక ప్రయోగంబునుంబోలె ఘనరస పాత్ర శోభితరంగ రమ్యం బైనదాని.

4. దివంబునుంబోలె నహిమకర భరితం బైనదాని - ఆ ఉచ్చైశ్శ్రవమనే దేవాశ్వాన్ని చూశారు. ఈ వర్ణనలో ఒక చమత్కారమున్నది. కద్రూవినతలిద్దఱూ విహరిస్తున్నారు. వారిద్దఱూ పరస్పరం సంభాషించుకుంటూ విమలోదధి తీరం వెంట వెళ్తూన్నారు. ఒకరికొకరి పల్కరింపు లెలా ఉన్నాయో చెప్తున్నాడు నన్నయ. మొదట చేయఁబడిన వర్ణన ఇద్దరూ చూసినది, ఏనుగుల యొక్క మొసళ్ళయొక్క సమూహముల చేత కొట్టబడుటవలన పుట్టిన గాలికి ఎగురగొట్టబడిన ఎత్తైన కెరటముల యందలి నీటితుంపరల చేత ఛటచ్ఛటాకార ధ్వనితో స్పృశించే ఆకాశం కలిగిన సముద్రం అక్కడ చూశారు; అని దీని భావం. ఇద్దరూ ఆనందించారు. తర్వాత కద్రువ బహువిద్రుమలతాలంకృతమై చాలా బావుందికదూ! అంటే వినత ఉద్యానవనంలా ఉందికదా! అందన్న మాట అలాగే ఒకరు ఘనరసపాత్రశోభితరంగరమ్యమై ఉంది అంటే మరొకరు నాటకప్రయోగమేమో అన్పిస్తోం దన్నారన్నమాట. ఇలా ఈ మిగిలిన మూఁడు వర్ణనలూ ఒకరితో వొక్కరు చక్కగా సంప్రదించుకొంటున్నట్లు- సంభాషించుకొంటున్నట్లు గోచరిస్తాయి. వీరిద్దరూ వెళ్తుంటే ఊరికే నన్నయ తనకు తట్టిన భావాన్ని వాళ్ళముందు రుద్దా డనడం కంటే వారిద్దర్నీ అలా మాట్లాడిస్తూ పంపా డనటంలో ఓ చమత్కారం ఉంది. ఇలా వాళ్ళు ఏకవాక్యతతో చివరివరకూపోరు. ఇద్దరూ సవతులు. వినతకి ఈమధ్య జరిగిన పరాభవంవల్ల కొంత అణిదిగింది కాని కద్రువ ఎలా వినతతో పంతం పెట్టుకుందామా అనే చూస్తోంది. ఇలా బావుందికదూ! అంటే వినత 'ఔను' అంటేసరే. కాదంటే ఏదో వాదుకి దిగుదామనే పద్ధతిలో కద్రువ సిద్ధంగా ఉంది. ఇలా వెళ్ళుతూఉన్నారు. ఆ ధవళాశ్వులు అవదాతాంబుజ ఫేనపుంజ నిభు నయశ్వోత్తమున్ దవ్వులన్ చూచారు. చూడ్డంతోటే పూర్వంలానే కద్రువ తన అభిప్రాయాన్ని 'మాడవె- అల్ల యతిధవళంబైన యశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబు నల్లయై యున్నది'' అని తెల్పింది. పై వాక్యాల్లో ఉపమాలంకారాన్ని వాడినట్లే కవి ఇక్కడా ఉపమనే వాడడం పైవర్ణన వారిద్దరిమధ్యా సంభాషణపూర్వకంగా సాగింపవచ్చు ననడానికి మరో నిదర్శనం. నల్లయుంబోలె అని యిక్కడంటే అక్కడకూడా ఉద్యానవనంబునుంబోలె- నాటక ప్రయోగంబునుంబోలె- దివంబునుంబోలె అని ఆ వర్ణనలో ఉంది. ఇద్దరి అభిప్రాయాలూ ఒకటైతే, కద్రువ మరో ఉపమాలంకారం వాడి చక్కగా ఉంది అనేదే. కాని వారి అభిప్రాయాలు ఇక్కడ భిన్నాలయ్యాయి. కారణం, కద్రువ అవకాశంకోసం అబద్ధం ఆడింది. వినతని ఎలాగైనా పడగొట్టి పందెం వేయించాలనే తహతహ తనకి బాగా ఉంది. అందుకనే ఉచ్చైశ్శ్రవము స్వచ్ఛంగా మహాపురుషుని కీర్తిలా ఉన్నా తోకనల్లగా ఉందని బొంకింది కద్రువ. దానికి వినత మామూలుగా సమాధానం ఇవ్వవచ్చు.

అలాకాక 'వినత నగి నీ వేకన్నులం జూచితేయక్కా యెక్కడిది నల్ల? యీ యశ్వరాజుమూర్తి మహాపురుషు కీర్తి యుంబోలె నతినిర్మలంబై యొప్పుచున్న యది'- అంది. ఏ కళ్ళతో చూశావు? నలుపెక్కడిది? స్వచ్ఛంగాఉంది అంది. అది ఆమె మనస్స్వచ్ఛతకు నిదర్శనం, అయినా వినత నగి అనడంలో కొంత అపహాస్యం చేసిందనే అర్థం కనిపిస్తోంది. కద్రువకి అవకాశం కొద్దిగా దొరికింది. భిన్నాభిప్రాయాలు వచ్చాయి. ఇలా మెల్లగా దీన్ని పందెం వఱకూ ఈడ్చుకుపోవచ్చని నిశ్చయంచేసుకొంది. అందుకనే వినత నగితే కద్రువ నవ్వింది. ఆ నవ్వు అపహాస్యపూర్వకమైనది. కద్రువకి వినతయెడఁగల పూర్తికక్షని తీర్చుకునే అవకాశం దొరికిందని ఆనందించింది. తమ కక్షకి వినత చెలికత్తెలు, కద్రువ చెలికత్తెలూ కూడా తమతమరాణులు నవ్వినప్పుడు, ఎదుటి రాణిని అపహాస్యం చేసినప్పుడూ తాము అనుకూలంగా ప్రతికూలంగా అపహాస్యంచేసి వారిలోని అభినివేశాన్ని రెచ్చగొట్టిఉంటారు. ఇలా రెచ్చకొట్టడం, వాళ్లు పందెం వేసుకోవడం మొదలైనవి శాపకాలం ప్రారంభమవడానికీ హేతువులే- సవతులమధ్య భిన్నాభిప్రాయాలకీ ప్రత్యక్షనిదర్శనములే. వాళ్ళిద్దరి మధ్యఉన్న కోపానికి సాక్షిగా కద్రువ మరో చిన్నపందెం ఏమీ పెట్టక

'అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు
నల్లగలిగిన నీవిప్డు నాకు దాని
వగుము మఱియుండునల్ల లేదయ్యెనేని
వీకు నే దాని నగుదుఁ బన్నిదము సఱుము
(2-32)

అని దాసీత్వమే పందెంగా పెట్టింది. వినతకూడా ఒప్పుకొన్నది. ఆ గుఱ్ఱము శరీరమున నలుపుంటే నీ విప్పుడే నాకు దాసీ అయిపో అని కద్రువ తన త్వరని ప్రకటించింది. అలా ఇప్పుడే అయిపో అన్న కద్రువ నలుపు లేకపోతే నేనూ ఇప్పుడే దాసినవుతాను అనదు. తనకు ఓ ధీమా ఉంది. వినత శాస్త్రవేత్తిబాగులది. దాని నెలాగైనా మోసపుచ్చవచ్చు నని ఒకటి. తనకి వేయిమంది పుత్రులున్నారు. ఏది ఎలాజరిగినా సమర్థించుకోగలరు. అదే కాక వినతకి ఓ శాపముందని తనకి పరోక్షంగా తెలుసు. అంతధీమాతో ఇప్పుడే అయిపో అంది. అయితే వినత 'దాసి చూతమురమ్ము' అంది. ఇలా అంటుందని కద్రువ ఊహించలేదు. పందెం వేశాక ఏ పరిచారికనో పంపించి నిర్ధారణ చేసుకు రమ్మనవచ్చును. వినత నోడింపవచ్చును కుంది. కాని మనమే వెళ్ళిచూదాం రమ్మనే సరికి కద్రువ మారుపలకలేకపోయింది. 'ఇప్పుడు ప్రొద్దులేదు-రేపకడ చూతము' అంది. దీనినిఁబట్టి కద్రువకి అనూరుశాపం ఒక్కటే ఆసరా ఉందని తెలుస్తోంది. తాను స్పష్టంగా అబద్ధమాడిందనికూడా బుజువౌతోంది. ఇక్కడొక కవితా విశేషంకూడా ఉంది పోని కద్రువ రేపు వచ్చి చూదాంఅంటే వినత వెళ్ళిపోవడమేనా ?-దాసీత్వమే పందెం కదా- అతి ముఖ్యమని తెలిసికూడా ఎలా వెళ్ళింది ? అని అనిపించడం సహజం. వినతకి ఓ విధమైన నిర్వేదం వచ్చింది. ఎంత శ్రమించినా తాను సవతికి దాసీకాక మానదు. అది శాపం. అవశ్య మనుభవించఁ దగినదే.

అదీకాక తాను 500 ఏండ్లు దాసీగా ఉండాలి. ఎంత త్వరగా ఆ దాసీతనం మొదలైతే అప్పట్నించి 500 సంవత్సరాలకి కదా తనకి పుత్రుడు పుడతాడు! అందుకని వీలయినంత త్వరగా దాసికావడం తనకి అవశ్యం భావ్యమని తెలుసు- అభీష్టంకూడా కేవలం పుత్రులకోసమే త్వరగా శాపావసానం కావాలి తనకి. తనదాసీత్వాన్ని పోగొట్టేకొడుకు ఉద్భవిస్తాడు. అంటే కద్రువకి- కొడుకులకీ తన తల్లిని ఊడిగం చేయించినందుకు తగిన శాస్తిచేసేవాడు వస్తాడనికూడా ఆశ ఉన్నది వినతకి. అందుకే వీలయినంత త్వరగా తన దుఃఖాలని అనుభవించి సుఖించాలనే బుద్ధితో వినత రేపుచూద్దామని కద్రువ అనఁగా సరే అన్నది. అందుకనే జ్యోతిషశాస్త్ర పారంగతులు కూడా భావి-అశుభాన్ని చెప్పరు. చెపితే తెలియని నిర్వేదం తయారై భవిష్య కార్యాల్లో అనాసక్తి బయలుదేరుతుంది. ఆ మహాబుద్ధితో పండితులు భవిష్యత్తు చెప్పకపోతే దౌర్భాగ్యులు కొందఱు చెప్పక పోవడాన్ని మరోదృష్టితో భావించి పండితుల కసామర్థ్యాన్ని కడతారు. ఇక్కడ వినతకి జరిగిన పెద్దపొరపాటు తన భవిష్యత్తు తనకి తెలియడమే. ఇఁక ఆరోజు రాత్రి కద్రువ తన పిల్లల వద్దకు వెళ్ళింది. వారిని వేఁడింది అన్నలార ! నాపంపు సేయుండు అని.

ఇక్కడ ఓవిశేషమున్నది. వినతకి తన భవిష్యద్విశేషం తెలుసు కాఁబట్టిఎలాగూ అనుభవించాలనే సంకల్పంతో తాను నిర్వేదంతోనూ, పుట్టఁబోయే కుర్రవాఁడు తన దాసీతనాన్ని పోగొడతాడనే సంతోషంతోనూ, దాసీత్వాన్ని పణంగా ఒడ్డి కావాలనే ప్రయత్నరాలై ఉంది. మరి కద్రువకి ఈతీరుగా పిల్లలను వేడవలసినంత కంగారెందుకు వచ్చింది ? పందెంలో ఓడిపోతాననే భయమేకాదు, రాబోయే శాపానికి తగిన వాతావరణం కల్పించవలసిన ఆవశ్యకత అటుకాలాని కుంది. కర్మాన్నిబట్టి జరిగి తీరాల్సిందే. అదికూడా కాలానుగుణంగా ఉంటుంది. అందుకనే కాలం-కర్మం కలిసిరావాలంటారు. కర్మ పరిపక్వమైతే తదనుగుణ కాలం సరిగా సమయానికి రానేవస్తుంది. సరిగా కద్రువ కొడుకులకి శాపసమయం ఆసన్నమైనది. అందుకని కద్రువ తన పిల్లలని అడగడం-వేడడం ప్రారంభమైంది. వారు ఒప్పుకోక పోవడం - తాను శాపమియ్యడం అన్నీ రాబోయే జనమేజయుని సర్పయాగానికి అనుకూల వాతావరణాన్ని కల్పించాలి. అందుకనే వారు ఒప్పుకోలా. 'ఉల్లతెల్లని తురగోత్తము వాలంబు' అనడం మూలాన అసలు ఏమాత్రమూ ఉచ్చైశ్శ్రవము తెలుపుకంటె వేరైన రంగులోలే దని తెలిసింది. కాస్త ఏదో మచ్చలాంటిది తోకమీద ఉంటే నల్లచెయ్యవచ్చు. కాని అసలేమాత్రమూ లేని నల్లని తేవాలంటే కొడుకులకి అర్థం అన్పించిది. అదికాక అంత ధైర్యం కలది కద్రువ ఎలాగోలా తలక్రిందులుగానైనకలహాన్ని వినతతో కోరుకుంటోందన్న ఈ అసంబద్ధవివాదంవలన తేలుతోంది.

అయితే కద్రువ చాలా తెలివైనది. కార్య సాధకురాలు. ఎవరివద్ద ఎలా ప్రవర్తించాలో తెలిసిన గడుసు పడతి. అందుకే ఇంటికి వెంటనే వచ్చి కొడుకులని తనవద్దకి రప్పించుకోకుండా తానే కొడుకుల వద్దకు వెళ్ళిందట. (కొడుకుల కడ 2, 34) ఎలా అయినా సరే ఆ గుఱ్ఱంపు శరీరాన్ని నల్లచేయప్రార్థించిందట. అక్కడ ఆమె మాటలు 'నాకు దాసి యగు మన వినత' అని. మన వినత అనడంలో కద్రువకొడుకులు వినతవద్ద చాలా చనువు కల్గినవారని తెలుస్తోంది. వినత అంటే కద్రువకొడుకు లందరికీ గౌరవ భావం ఉందని తెలుస్తోంది. అందుకనే మన వినత అని తానుకూడా కొడుకుల పక్షాన ఉన్నట్లు పలుకుతోంది. కాని వినతపట్ల కద్రువకొడుకుల కున్న గౌరవ భావం తమ తల్లి మీఁది కంటె ఎక్కువ. అందుకనే తల్లి పనిచెనని యధర్మ పు సేయంగ నగునె? అని వినతకు అధర్మ పద్ధతిని దాసీత్వం అంటఁగట్టడానికి మనః పూర్తిగ వారు వ్యతిరేకించారు. మళ్ళీ మళ్ళీ అడిగినా 'అనయ మిదియుఁ దల్లి పనిచె నని యధర్మువు సేయంగ నగునె?'

అని అనయము (మళ్ళీ మళ్ళీ వ్యతిరేకించారు. పైగా ఎఱుక గలరె మగువలెందు? అని ఓ సూచన చేశారు. ఏదో, గుఱ్ఱం నల్లగా లేదా తెల్లగా ఉందా? లేదా? అనే చిన్నవిషయంమీఁద పంతాలకి పోయి జీవితాంతం దాస్యం చెయడం పందెముగా వేసుకొంటారా? ఎంతటి యజ్ఞానులీయాడువారని యిరువురినిఁ గూర్చిఅన్నారు.

వినత అమాయికతకీ కద్రువ మహామేధస్సుకీ ఆశ్చర్యపడ్డారు. అయితే కద్రువ యెంతటిదో కాద్రవేయులకి తెలుసు. కానీ ఎలాగైనా కద్రువని బతిమాలి వినత కపాయంలేని రీతిని ఆలోచించితే బావుంటుం దనుకొన్నారు. కానీ అది సాధ్యంకాని విషయం కద్రువకి వినతఅంటే ఉన్న ఈర్ష్యాపద్ధతి కాద్రవేయులకి తెలుసు. అందుకని అందరూ ఒక్కసారి ఆలోచించారు. వినతని దాసీగా తీసుకోవడం సర్వవిధాలా అధర్మం అని తోచి చివరకెవ్వరూ సుముఖులు గాకపోతే కద్రువకి కోపం వచ్చింది. జనమేజయుఁడనే రాజు చేయుఁబోయే సర్పయాగమునం దీపాములన్నీ మరణము నందుగాక। అని శాపమిచ్చింది. 'ఉరగములకు శాపం బిచ్చెన్'- అనటంలో విశేషముంది. తమ తల్లి కోపోద్దీపితముఖి కాఁగానే భయపడి పాములన్నీ బయలుదేరి వెనక్కి వెళ్ళిపోతూంటే శాపమిచ్చింది. ఆ శాపాన్ని వినే సమయంలో అవి ఉరగాలుగా ఉన్నాయి. అంటే (ఉరోభిఃగచ్ఛంతీతి) పొట్టతోపాకుతూ వెడుతున్నాయని అర్థం. కావాలని కన్న వేయిమందికీ అగ్నిహోత్రంలాంటి శాపం ఇచ్చింది. పశ్చాత్తాపమైనా ఆమెకు కలుగలేదు కారణం అభిమాన విషయం (Presti-age) లేదా తోడి సవతికి ఊడిగం చేయాల్సి రావడం. కానీ కర్కోటకుఁడనేవాడు శాపానుభవానికి వెఱచి తన తల్లిమాటకి సై అని ఉచ్చైశ్శ్రవం తోక వద్ద నల్లగా వ్రేలాడి, వినత నోటుపడేలా చేసి, కద్రువని యజమానురాలిఁగ వినతను దాసీగా చేశాడు. ఎట్టివార్కైనా శాపఫలం అనుభవింపక తీఱదు. కర్మఫలం అనుభవించాలిగాబట్టే ఒక్కళ్ళూ అధర్మానికి పాల్పడలేదు. వెయ్యిమంది నాశనమవడాని క్కారణం సృష్టిలో నియత రీతిని ప్రాణులుండాలనేది కూడా ఓకారణం కావచ్చు. అందుకనే అప్పుడప్పుడు భూదేవి భారం మొయ్యలేక పోతున్నానని భగవంతుణ్ణి ప్రార్థించడం, ఆయన తదనుగుణంగా ఏదోరీతిని పాపులని సంహరించి కొంత భారక్లేశాన్ని తగ్గించడం అనాదిగా పురాణాదుల్లో వినపడుతూంటుంది. సృష్టి పెరిగిపోకుండా చాలావిధాలుగా అరికట్టడం జరుగుతుంది. డార్విన్ సిద్ధాంతం కూడా ఈనిరూపణలో మనకి ఆధునిక పద్ధతిలో తోడ్పడుతుంది. Struggle for existance) అనేసిద్ధాంతం (జీవనానికి సంఘర్షణ) వలని కొన్ని ప్రాణులు నశిస్తాయి. మఱికొన్ని వ్యాఘ్రాదులు పిల్లల్నికని ఆకలితో తమపిల్లల్ని తామే తింటాయి. ఇదే వైయాకరణ సిద్ధాంత కౌముదిలో పాణిని 'నాదిన్యాక్రోశే పుత్రస్య. అనేసూత్రంలో ప్రత్యుదాహరణ నిస్తూ 'పుత్రాదినీ సర్పిణీ' అనే ఈ వాక్యాన్ని (ఆక్రోశేకిమ్? అనేదానికి) వ్రాశాడు. అది సహజ మని దాని భావం. వ్యాఘ్రాలూ-సర్పాలూ తమ పిల్లలని తామే తింటాయి. లేకపోతే సృష్టిలో ఇన్ని పాములు పెరిగితే వాటివంశాలూ, ఉపవంశాలూ కలిసి కొన్నాళ్ళకి అవి స్వైరవిహారంచేసి మానవుల్ని సంహరిస్తే సర్పసామ్రాజ్యమై పోతుంది.

ఈ విషయంగూర్చి ఎంతైనా వ్రాయవచ్చు విస్తరభీతి వల్ల మానేస్తాను.

(సశేషం)

# అగ్నిచిత్రం

కుమారి పసుమర్తి పద్మజవాణి

అభాగ్యుడి ఆశల్లా
మినుకు మినుకు మంటూ
దిగంతాల్లోకి దిగిపోతున్నాయి
తారలు.

శాపగ్రస్తుడి మొహంలో
చిరునవ్వులా
వెలవెలబోతోంది తొలి వెలుగు.

రాత్రి ధాత్రి రాల్చిన
విరహ వేదనాశ్రువులు
బయళ్ళ పచ్చల మీద
ముత్యాలు పరిచాయి.

కీచురాళ్ళ నియంతృత్వం
అంతం కావాలంటూ
ఎక్కడినించో కీచుగా
ఒకటి రెండు పిట్ట కూతలు.

మార్పుకోసం ఓర్పుగా
ఎదురు చూస్తోన్న ప్రకృతి
ఆ కాస్త సవ్వడిలోనే
విప్లవ శంఖారావం వింటోంది...

ఇంకా...అంధకారంలో
తలమునకలుగా నిలబడిన...
ఆకులూ, కొమ్మలూ-
విచ్చుకోబోతున్న
నెత్తుటి ముద్దల్లాంటి
చిగుళ్ళ చేతుల్లో
కాంతి ఖడ్గాల్ని
సంభ్రమంగా తిలకిస్తున్నాయి.

అవని ఈసంభరం లో
హఠాత్తుగా,
దారి ప్రక్కను సోలిపోయిన
బిచ్చగాడి ఆకలి మంటల
రవ్వలు ఎగిరివెళ్ళి...
తూర్పు
అంటుకుంది.

# తత్త్వాదర్శము

- శ్రీ జమదగ్ని.

(ఈ పద్యములు నా 'గిరి ప్రదక్షిణ మహాకావ్యము' నందలి షష్ఠపదమునుండి ఉద్ధృతములైనవి. శ్రీ కాళహస్తీశ్వర స్వామి గిరిప్రదక్షిణము ముగించి ఆలయములో ప్రవేశించు నప్పుడు అభిముఖముగా నుండిన శ్రీ దక్షిణామూర్తిని చూచుచుండగా కథానాయకులగు గురుశిష్యులు శ్రీ శంకరుల స్తోత్రమును మననము చేయుచున్నారు.).

అద్దమ్ములో నీడ యద్దమందే యుండి
యద్దానికిని దూరమై కనఁబడు
స్వప్నమ్మునందోఁచుజగమంతయుం గూడ
వెలినున్న యట్లై కన్పించు, నట్లె
స్వాత్మయందే విశ్వ సర్వస్వ మున్నది
యద్దాని కన్య మెయ్యదియు లేగు
మెలఁకువ గలఁగంగఁ గలిగినకలయెల్లఁ
దనయందె యను జ్ఞాన మెనయునట్టు
లాయనాద్యవిద్యా వశమైన మనసు
సాధనమ్మున గురుదయన్ స్వచ్ఛమైన
విశ్వవిభ్రాంతి పోయి సంవిన్మయైక
దక్షిణామూర్తి రూపుఁడై తానుమిగులు॥

బీజస్థవృక్షమై విరియు విశ్వంబెల్ల
నాత్మోద్భవంబౌచు నందె యడఁగు
నయ్యాత్మ మాయావియన్నట్లు తనమాయ
దేశకాలము లను ద్విదళము లను
విస్ఫుటం బొనరించి పెనువృక్ష మామాయ
నిదియెల్ల నెంతగా నెదుగఁ జేసి
యోగీశ్వరుని బోలె యుక్తుఁడై విహరించి
స్వేచ్ఛమై యుపసంహరించు చుండు
పోడ వెఱుంగని విశ్వమా భూమమందె
వ్యక్తతన్ బొందకుండి యవ్యక్త మనఁగ
నుండి యున్నదె జీవదేవుండు నట్లె
దక్షిణామూర్తి కిదియె మద్వందనమ్ము॥

ఎంతచిత్ర మ్మొకో యీవిశ్వ మిది యెల్ల
నెవ్వాని వెలుగున నిట్లు తోఁచు
నయ్యాత్మయే లేని యట్లై యిదే యున్న
దన్నట్లుగాఁ దోఁచు నట్టి దశను
విస్మృతంబగు నాత్మ విజ్ఞాన మందించి
తత్త్వమసి యని సత్యమ్ము తెలిపి
యాత్మానుభవమంది నంతట తిరిగి జ
న్మం బెఱుంగని మోక్షమహిమనిలుచు
నట్టు లాశ్రితకోటి కనంత కరుణ
వేదసారంబు నెఱిఁగించు వేదవేద్యు
దక్షిణామూర్తి కేను ప్రదక్షిణించి
యించు భక్తిని సాష్టాంగ మెఱగువాఁడ॥

చిల్లుల కుండలోఁ దిల్లిక యున్నట్లు
వెలుఁగైన యయ్యాత్మ వెలుఁగులవియె
కనుముక్కు చెవియాదిగాగల జ్ఞానేంద్రి
యద్వారములనుండి యవలికేగి
యవ్వాని పరిమితి హద్దున శబ్దాది
పంచకం బెఱుఁగ నీ వంచితుండు
నేను ప్రపంచ విజ్ఞానంబు నందితి
నను కెల్ల యజ్ఞాన మాత్మ వెలుఁగ
యింద్రి యమ్ముల చేత నట్లెఱుఁగఁబడును
నీవె నిను భ్రాంతి వశమునన్ వేఱుగాఁగ
చూచు చుంటి వటంచు విశుద్ధుఁడైన
దక్షిణామూర్తి తెలుపునతత్త్వ మతఁడె॥

దేహమ్ము ప్రాణ మింద్రియమనోబుద్ధ్యాదు
లివి యాత్మ కానేర వింక నెదియు
ననుభవంబున కెట్టు లందుట లేదని
శూన్యమే యాత్మగాఁ జూచువారు
బాలాంధ జడులని భావింపవచ్చును
మాయా విమోహితుల్ మర్మ మెట్లు
తెలియ నేర్తురు? శ్రుతి తెల్పుమార్గానవై
వమును నమ్మికొలుచు భక్తజనులు
దేవమహిమను చిత్తశుద్ధిని భజించి
మాయపారవీడఁ దత్త్వమర్మమ్ము తెలిసి
శూన్య మెఱిఁగెడువాఁ డెతచ్ఛుద్ధుఁడనుచు
దక్షిణామూర్తి గొల్తురుతత్పరులయి॥

సుప్తిలోననుభూతి శూన్యంబుగానుంట
నాత్మశూన్యంబని యనఁగరాదు
అర్కేందులను రాహువాక్రమించినయట్లె
మాయాక్రమ్ముట నెయాత్మయుఁదెలియదు
ఉపకరణములన్ని యుపసంహృతమ్ములై
యునికిమాత్రముగాఁగ నుండునపుడు
సుప్తికిన్ ముందున్న చొప్పున మెలఁకువ
కన్నంతఁ దెలియుగా గలుగుచుంట
నాత్మశూన్యముకాక యయ్యదియ నిత్య
మెదియుఁ దెలియకపోవుట నెఱిఁగి నిద్ర
సుఖమునందితి నేనను సుఖ మయుండె
దక్షిణామూర్తిస్వామినిత్యముభజింతు॥

బాల్యకౌమార యౌవనవార్ధకమ్ముల
జాగ్రత్సుషుప్త్యాది సమయములను
తెగకయనుస్యూతముగనుండి తెలియుచు
నహమంచుఁ బ్రకటితంబగుచునుండు
నాత్మయున్నదినిత్యమదియ వస్త్రములట్లు
జీర్ణదేహములూడ్చి చెందు నూత్న
ములను గావున భ్రాంతిమోహమ్మునందక
భజియించువారి కభయ మొసఁగుచు
దన్నుదాఁదెల్పికొను పరాత్పరుఁ డతండు
ఏకమేవాద్వయుం బ్రహ్మమెపుడునుండు
దక్షిణామూర్తియై తెల్పు తత్త్వమెల్ల!
బ్రహ్మమెఱుఁగుట తద్దయాఫలితమగును॥

నిద్రలోఁబురుషుండు నిఖిలజగమును భి
న్నముగఁజూచెడి రీతిజ్ఞాని కాక
ముందరీ విశ్వంబు మోహితుండై యుంట
భిన్నమైనట్లె కన్పించుచుండు
గురువును శిష్యుండు కొడుకునుతండ్రియు
యజమానుడున్ భటుడనెడిభ్రమలు
వెంటాడుచుండును విద్యచే తత్త్వంబు
తెలిసిన యంతటఁ దెలియునతఁడె

స్వప్నజాగ్రదాదులఁ దానుబడయుచిన్న
భిన్నవిశ్వము మోహకల్పితమె యగును
ఆత్మయొక్కఁడె సత్యమయ్యదియె తాను
దక్షిణామూర్తి తానయౌ తత్త్వమరయ॥

(తరువాయి 13 వ పేజీలో)

# గ్రంథసమాలోచన

## వేణీసంహారము

[ఆంధ్రీకరణము - శ్రీ విద్వాన్ దేవరకొండ చిన్నికృష్ణ శర్మగారు. శ్రీ లక్ష్మీజ్యోతి పబ్లికేషన్సు. ఏలూరు రోడ్డు. విజయవాడ. వెల. 3రూ ]

సంస్కృత రూపక కారులలో భట్ట నారాయణుడు ద్వితీయుడు. అవిస్మరణీయుడు. వాని వేణీసంహారము స్వతంత్ర మనోహర మార్గమున నడచి వాఙ్మయమున ప్రత్యేకస్థానము నందినది. శాకుంతలాదుల కున్నంత యనువాద బాహుళ్యము దీనికి లేకపోవుట (వేణీసంహారమునకు) అపకర్ష కాదు. ఉత్కర్షయే. అనువాదాద్యనుసరణ కతీతమగు మనోహర మార్గము నరచితమగుటే దీని యనువాద వైరళ్యము నకు హేతువు. ఇట్టి యనువాదమునకు దిగి నిలిచినవారు కొందరు. నిలువంజూచిన వారు మరికొందరు. ఇట్టి వారిలో శ్రీ విద్వాన్ దేవరకొండ చిన్నికృష్ణశర్మ గారొకరు వీరు 'విజ్ఞప్తి'లో ననేక విషయములను దడవి సాధ్యమైనంతవరకు నాయా విషయములను పరిష్కరించిరి. నాందీశ్లోకముల వలన భట్టనారాయణుడు శివకేశవ భేదబుద్ధిలేని యద్వైతి యనిరి. కథలో మాత్రము కృష్ణపారమ్యము మిక్కిలిగా నగపడును కదా.

కొన్ని విరుద్ధ విషయము లనుచు నందులో ద్రౌపది భీమునకు తర్పణమిమ్మనుట యాచారవిరుద్ధ మనిరి. పంచభర్తృకయగు ద్రౌపది భీమభార్యగా తర్పణోదక మీయవచ్చునుకదా! వేణీసంహార నాయ చిత్య విచారణ మరింత విపులముగా నుండవలయును. నాయకత్వమున ధర్మజ భీములకు తుల్యప్రాధాన్యము. ఆవివాదమును కొంత వివరించిన బాగుండెడిది. ద్రౌపదీభానుమతులలో భానుమతి కగ్రస్థాన మిచ్చుట విచారణీయము. అంకితములోని మొదటి శ్లోకము 1,3 పాదములలో యతిభంగము కలిగినది. మందాక్రాంతలో నాల్గవ యక్షరము యతిస్థానము కదా! (1 శ్రీవత్సఃకుంకుమ 2) భాగ్యశ్రీ మంగళగిరి) అట్లే మూడవపద్యములో నన్వయము దురూహము. నాల్గవ పద్యము మూడవ పాదముచివర 'వేణీసంహారము' అనుచోట 'ణీ'అని గురువుండరాదు. ప్రస్తావన యనువాద మూలమునకు భిన్నముగా నున్నది. అట్లే 21వ పేజీలోని క్రుద్ధుడగు భీముని మాటలలో 'గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు' అన్నదానికి నాదుచేతలకే భూపతికిందు గౌరవులచేతం గాదుపో నేటికిక్' అనునది సరిపోవునా? 26వ పేజీలోని భీముని పద్యముకూడ మూలానురోధ స్ఫూర్తిని వీడినది. 29వ పేజీలో ఉత్తంసయిష్యతి కచాం స్తవ దేవిభీమః' అనుదానికి 'చిక్కులన్ దీర్చి నీకురుల్ ముడుచునే డిదె భీముడు పాండవప్రియా!' అన్న యనువాదము, ద్రౌపదిని పాండవప్రియా యనుటయు విచారణీయములు.

31వ పేజీలోని పద్యమును మూలభిన్నముగానున్నది. 36వ పేజీలోని సఖీవాక్యము స్ఫూర్తిమంతముగా లేదు. 38 పేజీలో దుర్యోధన, కంచుకులు కొద్ది భేదముతో నొకశ్లోకమును చెప్పుదురు. దుర్యోధనుడు 'స్వబలేన నిహన్తి సంయుగే న చిరాత్పాండుసుతః సుయోధనం' అని యాదృచ్ఛికముగా ననగా కంచుకి ఆ యమంగళమును 'పాండుసుతంసుయోధన' అని సరిదిద్దును. ఆరెండు శ్లోకములును భేదరహితముగ నొకేవిధముగ దుర్యోధన కంచుకులచే జెప్పించిన యనువాదకుని సావధానత నేమనవలెనో విజ్ఞులూహింపగలరు. 50వ పేజీలోని పద్యము మూలవిరుద్ధము, సర్వభంజకమునై యున్నది.

అప్పుడే ప్రవేశించిన కంచుకి దుర్యోధనుని నాయూరు యుగమును మాట వెంబడిగా భగ్నము భగ్నమనును. దుర్యోధనుడు 'కింనాము' యని ప్రశ్నించును. (అనువాదములో నెవనిచేత యని యున్నది) కంచుకి'భీమేన' యని చెప్పును. భీమునిచేతననియు నాయూరువునకు విశేషణముగాను అన్వయించును.' ఈఘట్టములో ననువాదకుని లోపము సుస్పష్టమగును. అనువాదమును యథామూలముగ రసవత్తరముగ నిర్వహించుటకు వలసిన సామగ్రి లోపము స్పష్టముగా నగపడును. ఇట్టి వానిని పట్టిచూపుట యడుగడుగునను సుసాధము. మూలగ్రంథములోని యుత్కృష్టత తన్ను ప్రోత్సహించినట్లుగా జెప్పుకొనిరి. శాకుంతలాదుల కనువాదములు బెక్కురు చేయలేదా యని సమాధానము చెప్పుకొనిరి.

అనువాదముకాదు మరేదయినను చేయగల ప్రజాస్వామ్యము మనకు గలదు. వెనుకటి యనువాదకులపై నాధిక్యముకొరకు గాదు యథాశక్తిగా ననువాదము చేయుట మూలాభిమానముననే యని వివరించిరి. మిక్కిలి త్వరగా చేయుటవలన కొన్ని పొరపాట్లుండవచ్చును. వానిని విద్వాంసు లెరిగించిన పునర్ముద్రణలో సవరించుకొందు మనుట వీరి వినయశీలత్వమును వెల్లడించును. త్వరగ ననువాదమును జేయుట యెందులకో? అనూహ్యము. మూలము నందలి గౌరవాభిమానములం గథాగమనము పాఠకుల నాకర్షించును. మూలానువాదముల బరిశీలించినచో నిరాశయే మిగులును. అనువాదమున కవసరమైనంత చాతుర్యము, భాషాసంపత్తి మున్నగునవి లోపించినవి. అనువాదకులు జాగరూకత వహించిన బాగుండెడిది. మూలములోని

ప్రత్యక్షరగతమైన స్ఫూర్తి క్వాచిత్కముగనైన కనరాదు. మూలశ్లోకములకు తగిన వృత్తములెన్నుకొనబడలే దనిపించును. ఏమైన శ్రీ శర్మగారినుండి మనమింకను రసవత్తరరచన నెదురుచూడవచ్చును. *

---

( 11 వ పేజీ తరువాయి )

ఈ విశ్వమందున్న వెనిమిదే యెనిమిది
యవియె భూజలములు నగ్ని వాయు
వులు నాకసమ్మును వెలుఁగుసూర్యుఁడుశశి
యూపైని యజమాను డనెడువాఁడు
నీ యెన్మిదా యీశు నెనిమిదౌ తనువులు
కాన నీశుఁడు కాని కణములేదు
శ్రుతులన్ని యిల్లెన్ని శుద్ధుఁడౌ యీశుండె
పురుషుఁడనఁబడు నీ పురమునందు
నిచ్చ మెయి జీవుఁడనఁగ వసించుననును
మోహమును వీడిచూచిన దేహమాది
విశ్వమంతయు శివుఁడె తద్భిన్నమేది ?
దక్షిణామూర్తి కిదియె మద్వందనంబు॥

ప్రత్యగాత్మయె సర్వ పరమాత్మయగు నని
స్పష్టమ్ము చేయు దశకము నెవఁడు
కంఠమ్మునన్ దాల్చి కరుణ సద్గురుఁడన్న
యర్థమ్ము మరువక యనవరతము
మననమ్ము ధ్యానమ్ము స్మరణమ్ము భక్తితో
చేయునో వాఁడు వశిష్ఠుఁడె యగు
సార్వాత్మ్య సంసిద్ధి సర్వేశ్వరుండౌచు
నయ్యష్ట మూర్తి విభూతి నందు
నాతఁడవ్యాహ తైశ్వర్య మంది దేహ
పతన మందినంతనె ముక్తిఁబడయు నిట్టి
పరమ సౌభాగ్య మిచ్చు సద్గురువరులకు
శతశతాధిక నతులు సన్నుతులు నగుత॥

దక్షిణామూర్తి యెదుట క్షేత్రపతినిలుచు
సన్నివేశంబు లభియించు టన్నఁ జాల
కష్ట మది లభించి యిటు శ్లోకముల యర్థ
మనన మొనరింపఁ గలుగుటే మనఁగవచ్చు॥

కొండ చుట్టిన ఫలితంబు కొంతయయ్యు
దీనిచే నది కొండంత యౌను నిజము
స్వామి నిత్యమ్ము చేసెడి స్వప్రదక్షి
ణమ్ము తత్త్వమ్ము తెల్పు నద్ద మ్మిదయ్య॥

---

# తిలక్ కవితా తత్త్వం

— శ్రీ ఎం. కృష్ణప్రసాద్.



నలభై ఆరు సంవత్సరాల పిన్నవయసు నసే చనిపోయిన దేవరకొండ బాల గంగాధర తిలక్ ప్రాచీన, ఆధునిక, కవితాసవ్యసాచి. అనుభూతి ప్రధానమైన ఆధునిక వచన కవిత్వాన్ని సుప్రతిష్ఠితం చేయడానికి, సుసంపన్నంచేయడానికి ఆయన భావ సంపన్నమైన కలం నుండివెలువడిన 'అమృతం కురిసిన రాత్రి' బాగా సహకరించింది.

తిలక్ నిజాన్ని గుర్తిస్తాడు. దానినే వచిస్తాడు. కానీ కమ్యూనిస్టు కాడు. తిలక్ అభ్యుదయవాది, కాని ప్రాచీనమైన ప్రతిసంప్రదాయాన్ని ఖండించడు. సత్సంప్రదాయాన్ని సమర్థించడంలో వెనుకాడడు. దేవుడ్ని నమ్ముతాడు. కర్మవాది మాత్రం కాడు. మానవయత్నానికి గల విలువను గుర్తిస్తాడు. సుందర దృశ్యాన్ని చూసి తన్మయుడవుతాడు. దీనులను, దరిద్రులను, చూసి ఆర్ద్రచిత్తుడౌతాడు. కవికూడా.

ఆధునిక కవితా సతికి వివిధ_అలంకారాలు సమర్పించిన వాళ్ళు చాల మంది ఉన్నారుకానీ, ఆమెనొసట రమ్యతిలకమలది, సుందరహార్మ్యాన్ని నిర్మించిన కీర్తి దేవరకొండ బాలగంగాధర తిలక్ది. భావాన్ని సుందరంగా, సుమధురంగా వెలిబుచ్చడం కవిత్వం. అర్థంమాత్రం పరారీకాకూడదు. 'నాకవిత్వం' అన్న ఖండికలో

'గాజు కెరటాల వెన్నెల సముద్రాలూ
జాజిపువ్వుల అత్తరు దీపాలూ
మంత్ర లోకపు మణిస్తంభాలూ
నాకవితా చందనశాల సుందరచిత్ర
విచిత్రాలు.'

అని తన కవితా లోకపు రమణీయ సుందర దృశ్యాలను మనోలోకంలో ప్రత్యక్షం చేయిస్తాడు.

కరుణ గుండెలనుకరిగించి కనులవెంట కన్నీరు రాలేటట్టు చేస్తుంది. మనసుని క్షాళన చేస్తుంది. అంతేకాదు. ఉన్నత పథగామిని చేస్తుంది. తన కవితలో కరుణకు గలస్థానాన్ని గురించి చెబుతూ

'అగాధ బాధాపాథః పతంగాలూ
ధర్మవీరుల కృత రక్తనాళాలూ
త్యాగశక్తి, ప్రేమరక్తి, శాంతిసూక్తి
నాకళాకరవాల ధగద్ధగరవాలు'

కవితలోనే కాక వ్యక్తి గతంగా కూడా తిలక్ మెత్తని మనసువాడు. తన లేఖల్లో ఒకచోట 'బాధకూ దుఃఖానికీ కరుగలేక పోతే ఈ బాలాగంగాధరుడు తన కవిత్వాన్ని, తనప్రాణాన్నీ బంగాళాఖాతంలో విసిరిపోతాడు.'

తన్ను అందమైన వానినిగా, ఆనందమయునిగా చిత్రించుకుంటూ ఎంత అందంగా చెప్పాడో చూడండి' అమృతం కురిసిన రాత్రి'లో

'నన్ను మాసికిలకిల నవ్వి ఇలా అన్నారు.
చూడు వీడూ
అందమైన వాడూ
ఆనందం మనిషైనవాడూ
కలలపట్టు కుచ్చు లూగుతున్న కిరీటం
ధరించాడు.
కళ్ళచివర కాంతిసంగీత గీతాన్ని
రచిస్తున్నాడు.
ఎర్రని పెదవులమీద తెల్లని నవ్వులవీణల్ని
మీటుతున్నాడు
ఎవరికీ దొరకని రహస్యాల్ని వశపరచు
కున్నాడు
నవనవాలైన ఊహోర్ణవాలమీద
ఉదయించిన సూర్యుడు
ఇతడేసుమీ మనప్రియుడు నరుడు మనకి
వరుడు'

ని అక్షరాలతో అక్షరమైన, అందమైన, తియ్యని గీతం కట్టాడు.

'ఆర్తిగీతం' అన్న కవిత ఆర్తులను గురించి ఆర్తి వ్రాసిన కవిత సింగారాన్నీ, కవితనూ, తత్వాన్నీ, అన్నిటినీ వద్దని, కాలదన్నీ, అసలైన కళ్ళను తెరిపించే దీన దృశ్యాలను చూశానని చెబుతాడు. 'ఆకలితో అల్లాడి మర్రిచెట్టు క్రింద మరణించిన ముసలివాణ్ణి, నిండు మాసాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్నీ, తల్లి లేక, తండ్రి లేక ఏడుస్తూ ముంజేతుల కన్నులు తుడుచుకుంటూ మురికికాల్వ ప్రక్కనే నిద్రించిన మూడేళ్ళ పసిబాలుడ్ని, పిల్లలకు గంజి కాచిపోసి తాను నిరాహారుడై రుద్ధబాష్పాకులితనయనుడై ఆఫీసుకువచ్చిన వృద్ధుని ప్యూన్ వీరన్నను, క్షయగ్రస్తభార్య యిక బ్రదుకదని డాక్టరు చెప్పినపుడు వణికిపోయిన అరక్త అశక్త గుమాస్తాను' చూశానని కరుణలో మానవ జీవన దైన్యాన్ని ఇలా వర్ణిస్తాడు.

'నేను చూశాను నిజంగా మూర్తీభవత్
దైన్యాన్ని హైన్యాన్ని
క్షుభితాశ్రుకల్లోలనీరధుల్ని గచ్ఛత్
శవాకార, వికారుల్ని.'

కవిగా కష్టాలపై కన్నీళ్ళను ఒలికించి తన పని అయిపోయిందను కొని ఊరుకోలేదు తిలక్. కర్మవాదాన్ని వల్లించనూ లేదు. దీనుల్నీ దరిద్రులనీ వదలివేసిన నాగరికతనూ విజ్ఞానాన్నీ ప్రశ్నిస్తాడు. మానవత్వం వదలిన మనుష్యుల్ని ఒత్తి చూపుతాడు.

'ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి?
ఏ విజ్ఞానప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?
ఇంక నన్ను నిర్బంధించకు నేస్తం ఈ
రాత్రి నేను పాడలేను; ఈ
కృత్రిమ వేషాన్ని అభినయించలేను
మానత లేని లోకాన్ని స్తుతింపలేను
మానవుడుగా శిరసెత్తుకు తిరగలేను.
ఈ నాగరిక తారణ్యావాసం భరించలేను.'

అయినా వ్యక్తిగా తానేం చేయలేదు; ఈ దురవస్థను తొలగించడానికి ఈ వ్యవస్థను తొలగించడానికి. ఈ వ్యవస్థ ఏం చేయకుండా మిన్నకున్నంత కాలం తన ఆవేదన నిష్ఫలం. ఆ విషయాన్ని ఆయన గుర్తించక పోలేదు. ఆయన ఆచరణ దూరమైన ఆదర్శాల గూళ్ళు కట్టుకున్న స్వప్నలోకవాసి కాడు. అందుకే 'ఆర్తగీతం ముగిస్తూ

'ఈ ఆర్తి ఏ సౌధాంతరాలకు పయనించగలదు ?
ఏ రాజకీయవేత్త గుండెలను
స్పృశించగలదు? ఏ భోగవంతుని
విచలింప చేయగలదు? ఏ భగవంతునికి
నివేదించుకొనగలదు...? అంటాడు.

'C I·D రిపోర్టు' అన్న కవిత ఆడెన్ కవితకు అనుకరణ అయినా స్వీయకవితలా భాసింపజేస్తాడు. ఇది వ్యంగ్యంతో కూడుకున్నది. ?

'లిఫ్టు అంటే అతనికి భయం. ఎప్పుడూ దాన్ని కోరలేదు ఉద్యోగంలో.' అంటాడు. ఈ లిఫ్టు అందరికీ తెలిసినట్లుగానే మేడల్లో ఉపయోగించే లిఫ్టు కాదు. ఉద్యోగాలలో లభించే ప్రమోషన్ కూడా లిఫ్ట్ అంటారు. ఎదగనివ్వని సమాజాన్ని పరోక్షంగా యీసడిస్తూ యిలా అంటాడు.

'ఇతని తండ్రి గుమాస్తా, తాత గుమస్తా, ముత్తాత గుమాస్తా, సాంప్రదాయికమైన వినయవిధేయతలకీ, గౌరవమైన దరిద్రానికీ వీళ్ళవంశం ఒక రస్తా.

శాంతి గురించి ఎంతోమంది కలలు కంటున్నారు. కవులు కవితలు అల్లుతున్నారు. రాజకీయ వేత్తలు ఉపన్యాసాలు యిస్తున్నారు. కానీ తిలక్ శాంతిని వెతికే విధానం వేరు. ఆయన వ్యక్తికి, వ్యవస్థకూ, ప్రపంచానికీ కూడా సుఖాన్ని యిచ్చే శాంతిని కాంక్షించాడు. అది విశ్వశాంతి. ఆ శాంతికి ఒక సుస్పష్ట రూపాన్ని ఇచ్చి మన మనోనేత్రాలముందు నిలబెడతాడు ఆమెకు స్త్రీ రూపాన్నే కాక స్త్రీ హృదయాన్ని యిచ్చి తెలుగుసాహిత్యంలో ఎనలేని స్థానాన్ని కల్పించాడు. నాకు తెలిసిఉన్నంత వరకూ మరి ఏ తెలుగు కవీ అంతగా శాంతికి రూపకల్పన చెయ్యలేదు.

'అపార కృపా తరంగితాలైన నయనాంచలాలు
ఆనందం జాలువారే స్నిగ్ధ దరహాస పరిమళాలు
సంస్కారపు కేశపాశంలో తురిమిన అనురాగపు గులాబి
సదాప్రజాహితైషిణి సుభాషిణి గర్వం లేని రాణి
కల్లనీ, క్రౌర్యాన్నీ, కాలుష్యాన్ని తిరస్కరిస్తుంది.
తెల్లని పావురాన్ని సరదాగా ఎగరవేస్తుంది.
చల్లని తల్లి. చక్కని చెల్లి. ఆమె పేరు శాంతి.
జడత్వాన్ని ఈసడిస్తూ, చైతన్యానికి జేజేలు కొడుతూ,
నిత్య యౌవన చైతన్యోత్సాహం లేమిని నిరసిస్తాను.
'మురికికాల్వమీద ముసలితనం మీద మృషాజగతి మీద
మహోదయం వికసించదు, వసంతం హాసించదు.

'అభినవ ఋగ్వేదం' అన్న చెణుకుల కవితలో స్త్రీ రచయితలకు [రచయిత్రులకు] ఒక చురక అంటించాడు.

'నవలలు నవలలు రాసేస్తున్నారు
కవలల్ని క్షౌద్రు ప్లెట్సుని సృష్టిస్తున్నారు'

కమ్మనికలలాంటి కవితను రచించిన తిలక్ పై వ్రాయాలంటే మరెంతైనా వుంది. ఎంత వ్రాసినా మరెంతో మిగిలిఉంటుంది. ఆయన కవిత ఒక సౌందర్యజలధి. చమత్కారాల రత్నాలకు అది నిధి. ఉప్పొంగే భావాల అమ్ములపొది. దానిని నాశక్త్యనుసారం మథించి యీ చిన్ని వ్యాసాన్ని వ్రాశాను.

'వెలుగులోనికి వస్తూ చీకటికి బలైపోయిన యువకవి'

# నూతలపాటి గంగాధరం

- శ్రీ కల్రా కార్తికేయశర్మ.

1975 జనవరిలో అనుకుంటాను నూతలపాటి గంగాధరం కవితాసంపుటి 'వెలుగులోనికి' నేను చదవడం జరిగింది. పూర్తిగా చదివిన తరువాత మంచి పుస్తకం చదివానన్న తృప్తి కలిగింది. ప్రతి కవితలోను అతడు చూపించిన నేర్పుకు ఆనందం కలిగింది. అతడితో పరిచయం ఏర్పరచుకోవాలని ఆసక్తి ఉదయించింది. కష్టపడి అడ్రసు సంపాదించాను. ఆ అడ్రసుకు ఉత్తరం వ్రాయకముందే అతడు అడ్రసుకు అతీతుడైపోయాడన్న వార్త పత్రికలో చదివి నమ్మలేకపోయాను. ఇదికలా? అనుకుని శరీరాన్ని గిల్లుకున్నాను. చుర్రుమంది. నిజమే! నవ్యతకు నాంది పలికిన నాణ్యమైన నవకవి నూతలపాటి పాముకాటుకు బలైపోయాడని తెలిసింది 'ఎంత తొందరపడ్డావయ్యా కవీ! అని బాధపడ్డాను. అతడి ఆత్మశాంతికి తడికళ్ళతో భగవంతుని ప్రార్థించాను.

ఇది జరిగి మూడేళ్ళయింది. కాలం ఎన్నో మార్పులను ప్రవేశపెడుతూ పురోగమిస్తూనే ఉంది. కొత్త కవులు బయలుదేరుతున్నారు. క్రొత్త కవిత్వాలు పుడుతూనే ఉన్నాయి. కాని నూతలపాటి మాత్రం నాజ్ఞాపకాల అంచుల్నుంచి జారిపోలేదు. మనస్సు మూలలలో దాగుండి తన కవిత్వాలు వినిపిస్తూనే ఉన్నాడు.

ప్రాచ్యకళాశాలలో సంప్రదాయబద్ధంగా విద్యనభ్యసించినా కాలాన్ననుసరించి 'నవత'ను ఆహ్వానించాడు నూతలపాటి. అందుకు 'చీకటిలోనికి', 'వెలుగులోనికి' అను కవితాసంపుటాలు సాక్ష్యం. చీకటిలోనికి కవితాసంపుటితో చిత్తూరు జిల్లాలో ప్రతిభ ఉన్న యువకవిగా పేరు తెచ్చుకున్న ఈతడు, 'వెలుగులోనికి' ప్రచురించి ఆంధ్రదేశమంతా విస్తరించాడు.

ముద్రణయంత్రాల ఆకలి తీరునంతగా ప్రతి సంవత్సరం తెలుగులో ఎంతో సాహిత్యం దిగుమతి ఔతోంది. నవల మొదలుకొని నాటకంవరకు అన్నిప్రక్రియలలోను విరివిగా పుస్తకాలు అందంగా సాక్షాత్కరిస్తున్నాయి. కొన్ని పుస్తకాల అందం 'బాపు' ముఖచిత్రం వరకే పరిమితంకాగా, మరికొన్ని పుస్తకాలకు కాలక్షేపం మాత్రమే వరంగా దక్కుతోంది. కవిత్వపు శాఖలోకూడా గత పాతికేళ్ళుగా ఎంతో అభివృద్ధి కనబడుతోంది. నవకవి మొదలు వృద్ధకవి వరకు ప్రతి ఏటా యథోచితంగా కావ్యప్రచురణ చేస్తున్నారు. ఎన్ని కావ్యాలు 'గీటు'కు వస్తున్నాయని ప్రశ్నించకుండా 'రాశి'ని చూసి తృప్తిచెందితే ఇదినిజంగా 'స్వర్ణయుగమే!' ప్రముఖుల పీఠికల్ని అడ్డుపెట్టుకొని కవితా సంపుటాలు రంగంమీదకు వస్తున్నాయి. ఏరూపంలో వచ్చినా 'మంచికవిత్వం' మాత్రం పాఠకుల ఆదరణకు పాత్రమౌతూనేఉంది అలా 1974వ సంవత్సరంలో పాఠకులచే ఉపద లందుకొన్న సంపుటి 'వెలుగులోనికి'. గుర్తింపబడ్డకవి నూతలపాటి గంగాధరం.

'వెలుగులోనికి' కవితాసంపుటిలో 'అర్చన' మొదలుకొని 'అవతలిగట్టు'వరకు ముప్పదినాలుగు కవితలున్నాయి. ఇందు 'ఆశాసుందరి' కవితమాత్రం పద్యకవిత. మిగిలినవన్నీ నవతను ఆవిష్కరించిన వచనకవితలే!

అందరు అభ్యుదయ కవుల్లా ఈకవి కూడా వెలుగును ప్రేమిస్తాడు. వెలుగుకోసం ఆరాటపడతాడు.

'నాకు వెలుగుకావాలి
నన్నూ, నాజాతినీ
చీకటినుంచి బయటికి లాగి
చిరునవ్వును వెలిగించి
చెలిమిని చెరనుంచి విడిపించి
ఎదనూ ఎదనూ
ఎప్పుడూ కౌగిలి గదిలో బంధించే
అచ్ఛమైన చిరువెచ్చని వెలుగుకావాలి'
ఆవెలుగు ఎలాఉండాలి?
'పీడితులను కరుణించే వెలుగు
ప్రేమను గుండెలనిండుగా నింపే వెలుగు
నిమ్నోన్నతాలను సమతలం చేసేవెలుగు
అరణ్యాలలోనూ మానవత్వాన్ని
సృష్టించే వెలుగు
అందరిలోనూ సమంగాప్రవహించేవెలుగు
వెలుగుకావాలి నాకు
నాకూ నాదేశానికి వెలుగుకావాలి !

ఆధునిక కవిలక్ష్యం ఇదే! ఋక్కుల నుండి స్పుత్నిక్కులవరకూ అనంతమైన కాలంలో వెలుగు-చీకట్లు రెండూ సమంగా లోకాన్ని పాలించినా తరతరాల మానవ జాతి 'తమసో మా జ్యోతిర్గమయ' అని మాత్రమేఅంది;అంటోంది. అందుకే మానవుడు చీకటిని చూడలేక రాత్రి నిద్రను ఏర్పాటుచేసుకున్నాడు. సూర్యునితో నిద్రలేచి, సూర్యునితో పయనించి, పశ్చిమాన క్రుంగిపోయే ఎర్రటిసూర్యుణ్ణి వెర్రిగా చూస్తూ నిట్టూరుస్తున్నాడు. నిద్రలేస్తూ అమితానందం, గూటికి చేరుకుంటూ విషాదం_ ఈరెండిటిని పరిశీలిస్తే వెలుగుపట్ల మానవుకున్న గాఢాభిమానం స్పష్టమౌతుంది.

పుట్టిన ప్రతి మానవునకూ భవిష్యత్తుపట్ల ఆరాటం, ఆశ ఉంటాయి. 'బాగా బ్రతకాలి' అని అందరూ వాంఛిస్తారు. కేవలం కోరిక ఉంటే చాలదు కృషి కూడా కావాలని అంటాడు గంగాధరం.

'బ్రతుకంటే వరంకాదు సమరం!
సమరం చావు కోసంకాదు
చావుకు సిద్ధపడ్డవాడే
సమరాని కాయత్తమవుతాడు

సమరంలో దిగిన వాడికి
చావైనా బ్రతుకైనా ఒకటే
సమరానికి భయపడని వాడే
స్వర్ణభవిష్యత్తును సృష్టించుకుంటాడు'

ఆధునిక మానవుని జీవితం సమస్యల వలయం. ఆవలయాల ఛేదనకు అతడు ఉద్యమించి నప్పుడే తళతళలాడే స్వర్ణ భవిష్యత్తు అతనికి సంప్రాప్త మౌతుంది. ఇదే కవితలో చివరగా కవి అనే మాటలు

'బ్రతుకంటే నిరాశ కాదు, ఆశ!
అపజయాల పోరాటంలో
అభివృద్ధి ఉందని చెప్పేది ఆశ
నిజంకోసం నీవు ఎదురు తిరిగినపుడు
నిండుభవిష్యత్తు నీదని చెప్పేది ఆశ!'

ఆ ఆశను ఆలంబనగా చేసుకొని పురోగమిస్తే భవిష్యత్తు బాగుండకేం చేస్తుందని మనందరకూ 'హితవు' బోధిస్తున్నాడు కవి.

కవి మనస్సు అతివిచిత్రమైనది. మనం రోజూ చూసేవస్తువులుకూడా కవికి క్రొత్తగా కనిపిస్తాయి. జీవితంలో వాటి స్థానం ప్రముఖమైనదని అతడు భావిస్తాడు. ఉదాహరణకు 'ఒళ్ళు, కళ్ళు, కన్నీళ్ళు' అనే కవిత చూడండి. కళ్ళు, కన్నీళ్ళు మనకు తెలిసినవే. ఒళ్ళు మనం మోసేదే! వాటిస్థానాల్ని మాత్రం గంగాధరం రసవంతంగా చెప్పాడు.

'జీవన వ్యాపారంలో
జీవుడు క్రమంగా ఆర్జించి
ఖర్చుపెట్టుకునే ఆస్తి-ఈఒళ్ళు'

నిజమే! ఆయ వ్యయాల సమత్వం కలిగిన ఏకైక ఆస్తి ఒళ్ళే!
'జీవునికి
పాపపుణ్య మార్గాలు చూపించి
ఆస్తిని ఖర్చు పెట్టించే ఏజంట్లు- కళ్లు!'

పాప పుణ్యాలకు మార్గాలు చూపించి ఆస్తి ఖర్చుకు ఏజంట్లలా పనిచేసే కళ్ళు, రారమ్మని ఆహ్వానించే వాకిళ్లు.

'గుండెబరువును దించటానికీ
కార్యం నిర్విఘ్నంగా
నెరవేర్చుకోడానికీ ఉపయోగించే
ఏజంట్ల చేతిలోని ఆయుధాలు- కన్నీళ్ళు!

బాధల బరువు దిగుమతికీ, కార్యక్రమ ఫలితాల ఎగుమతికీ మహత్తరమైన ఆయుధాలు కన్నీళ్లు. అరిచి సాధించలేని మనం ఏడ్చిసాధించవచ్చు.

ఇక కాలంయొక్క మార్పును 'ప్రవాహం'తో పోల్చుతూ
'పాతకుళ్ళునూ, ప్రతిబంధకం ముళ్లనూ
పనికిరాని చెత్తనూ, బరువెక్కిన కుప్పనూ
జాగు లేక, జాలిలేక
అవలీలగా ఈడ్చుకు పోతున్న
ప్రవాహాన్ని ఎవ డాపగలడు?
తనపని పూర్తిఅయ్యేవరకదిఆగదు'అంటూ
ఆప్రవాహం తీసుకువచ్చే మార్పును గూర్చి ముచ్చటిస్తున్నాడీ కవి.

'పనికిరాని పాతమీదవిసుగుపుట్టినవాళ్ళూ
విలువైన క్రొత్తంటేమనసుపెట్టే వాళ్లూ
పిరికి బరువులు మోయు లేని వాళ్ళూ
వెలుగు లోకంకోసం ఎదురుచూసేవాళ్లూ
ఆప్రవాహానికి స్వాగతం పలుకుతారు
ప్రవాహం వస్తే ఆనంద నృత్యం చేస్తారు
ప్రాణాలైన పణంగా అర్పిస్తారు
వాళ్ళ గౌరవా లందుకుంటూ
వాళ్ళకోరికల్ని మన్నించుతూ
మార్గంపవిత్రంచేసి వెళ్ళుతుందిప్రవాహం!'

సమాజంలోనైనా, సమాజానికి దర్పణంపట్టే సాహిత్యంలోనైనాకాలంగడిచే కొద్దీ మార్పులురావడం సహజం. కాని ఆమార్పు నిజాన్ని మాడనితీర్పు కాకూడదు. బహుజనామోదంకావాలి. అప్పుడే మార్పుకు విలువ. నేటి మానవుడు పాత విలువల్ని ప్రశ్నించే ఎత్తుకు ఎదిగాడు. తన ప్రశ్నలకు మంచి సమాధానము లిచ్చిన విలువల్ని మాత్రమే ఆమోదిస్తున్నాడు. మిగిలిన వాటిని విడిచిపెట్టి క్రొత్తవిలువల సృష్టికి ప్రస్థానం సాగిస్తున్నాడు. అందుకే 'ఇది మంచి విలువ' అని నిర్ణయించడం కష్టమైపోతోంది.

'నడుస్తున్నచరిత్ర'ను సమీక్షిస్తూ గంగాధరం అంటున్న మాటల్ని పరిశీలించండి.

'నిదురించే దేవుడ్ని లేపకు
నిప్పులు చిమ్మే నరుడ్ని ఆపకు
కలాన్ని మత్తులో ముంచకు
కవితను కాంతతో పోల్చకు'

పైపాదాలలో 'నిదురించే దేవుడు స్తబ్దతకు ప్రతీక. 'నిప్పులు చిమ్మేనరుడు' చైతన్యానికి పతాక. కలాన్ని మత్తులో ముంచకనటం, కవితను కాంతతో పోల్చ వద్దనడం ఆధునిక హృదయం ఇచ్చిన రంగైన తీర్పు.

'గతాన్ని మూర్ఖంగా కొలువకు
గతాన్ని మళ్ళీ మళ్ళీ పిలువకు
నిన్నటి నిజం నేటి విషం
నేటివిషం రేపటినిజం

మతంపట్ల మార్క్షపు అవగాహన సమైక్యతకు గొడ్డలిపెట్టు వంటిది. గతాన్ని పదేపదే పిలవడం తిరోగమనానికపునాది. నిన్నటి నిజానికి నేడు విలువలేదు. నేడు విషం అనుకున్నది రేపు నిజమై కూర్చుంటోంది. చివరి రెండుపాదాలు క్షణక్షణం మారే విలువల 'గతి'కి దర్పణం వంటిది.

(సశేషం)

# ఆపాదమస్తకవర్ణనము

— భారతీప్రియ.

ఎవరయినా మనల్ని కొత్తమనిషిని చూసినట్లు చూస్తూ—ఉంటే—ఏమిటలా ఎగాదిగాచూస్తున్నావ్? అని వెంటనే అడుగుతాం. అంటే కింద నుండి మీదికి చూస్తున్నా డన్నమాట. ఇలా సామాన్యంగా వ్యక్తుల్ని పరిశీలించే టప్పుడే ఆపాదమస్తకము(పాదాలనుండి తలవరకు)అనే పద్ధతిని అనుసరించేటప్పుడు ఒక నిష్ఠలో ప్రత్యేకప్రయోజనం కోసం దేవుడినో, దేవతనో ఆరాధించేటప్పుడు ఒక క్రమం ఉండవద్దా? తప్పకుండా ఉండాలి. లేకపోతే ప్రమాదం! అని జడిపిస్తారుకూడా మనపెద్దవాళ్ళు. వాళ్ళు జడిపించడమే కాదు నిజంగా కూడా ప్రమాదమే. మనం కొన్ని సామాన్య ఉదాహరణలే చూద్దాం. ఒకడు వేగంగా పరుగెత్తుకుని వెంట వస్తుంటే వాడి కాళ్ళను చూచే మనం తప్పుకోవాలిగాని వాని ముఖం పరీక్షించి చూడ్డం కోసం నిరీక్షిస్తూ నిలబడకూడదు. అదే ఒకకారు అయితే దాని చక్రాల స్పీడు చూచే మనం తప్పుకోవలసి ఉంటుంది. స్థిరంగా ఉన్నాకూడ మనం ఒక్క చెట్టు ఎక్కాలంటే దాని మొదలు (వేళ్ళు) భూమిలోగట్టిగా నాటుకున్నాయా లేదా చూసుకోవాలిగదా! లేకపోతే పండ్లు దొరికేదానికి బదులు మనం పండ్లు ఊడేటట్లు క్రిందపడతాం. ఇలాగా చెట్టు, జంతువు మనిషి మొదలైన వాటన్నిటిలో వాటి జవజీవములు (వేగము—ఉనికి) చూసి మనం మెలగవలసి ఉంటుంది. లేకపోతే ప్రమాదమని మన అనుభవం హెచ్చరిస్తోంది.

అందుకనే దేవాలయంలో దేవుణ్ణి చూసేటప్పుడు ముందుగా పాదాలు దర్శించి నమస్కరించి తరువావాత తలిమ్మా రూపము చూడమన్నారు. లేకపోతే దేవుడి కిరీటం బాగుంది, దేవి ముక్కుపుడక బాగుంది అని చూస్తూ బుద్ధికి దొంగతనం నేర్పడం జరుగుతుంది. అక్కడితో ఆగినాపరవాలేదు. దేవుడిదగ్గరదొంగతనం ఏమిటి? ఆయనకు చాటుగా మనం ఏమన్నా చేయగలమా? చేయగలము అనుకుంటే అదే పతనానికి ప్రారంభం. ఇది దొంగతనం కంటే చాల ప్రమాదకరమైంది. దీన్ని దిద్దుకునే లోపల కొన్ని వేల జన్మలు దొర్లిపోతాయి. కింద గట్టిపట్టు చూసుకోకుండా పైకి ఎగబ్రాకితే ఈపతనం తప్పదుమరి. ఒక పతనమైతే మనకు సహజంగా ఉన్న శక్తి కూడ క్షీణిస్తుంది. కనుక మొదటిసారి తప్పి తరువాత చేసే ప్రయత్నాలన్నీ చాలవరకు వృథాయే అవుతాయి. అందువల్ల ఎన్నివేల జన్మలైనా వ్యర్థంగా గడిచిపోతాయి. ఈ అంశం దేవి ఉపాసనలో స్పష్టంగా బుజువవుతుంది. ఉపాసన అంటే (ఉప + ఆసన) సమీపముగా నుండుట. ఉండాలని దేవి విగ్రహానికి సమీపంగా ఉంటారు. విగ్రహం అంటే ఇక్కడ కొయ్య బొమ్మఅనే అర్థం. మరిదేవీ విగ్రహం అంటే ఏమిటి? మనందరికీ కాళ్ళు, చేతులు, వదనము, హృదయమూ ఉన్నట్లే దేవికి ఉంటాయి గదా! కాళ్ళుచేతులు అనేవి కదిలే అవయవాలు గదా! మరి స్థిరంగా చెక్కబడిన విగ్రహంలో భాగాలను చూసి అవే దేవి యొక్క కాళ్లు, చేతులు అని ఎలా అనుకుంటున్నారు? అందువల్ల దేవి ఉపాసన చేసే సాధకుడు ప్రకృతి స్వరూపమైయున్న దేవియొక్క అవయవములు ఏ విధంగా ఉన్నాయో ప్రకృతిలో పరిశీలించాలి.

ప్రకృతి అంటే ఈ సృష్టిమొత్తం. ఈ మొత్తాన్ని పరిశీలించడానికి అంతా మనకు కనబడదు గనుక మనం ఉన్న చోటనే ఉండి ఆమె అనుగ్రహం వల్ల విశ్వరూప సందర్శనము కలిగే టంత వరకూ ఉత్తమ జీవితం గడుపుతూ ఉండాలి. ఇది ఎంతో కష్టమైనపనికాదు. మన తల్లులదగ్గర మనం చిన్నప్పుడు ఎలా కాళ్ళదగ్గరఉన్నామో మన తమ్ముళ్లు తల్లి కాళ్ళదగ్గరకు పాకుతుంటూ వచ్చి ఎలాగ కూర్చుంటున్నారో చూస్తే మనకే తెలుస్తుంది. ఆ పసివయస్సులో ఆ తల్లిని మనం పలుకరించగలిగే శక్తిగలిగి ఉండడం. ఇంక పాలు అడిగే ప్రశ్నే లేదు. కాని ఆతల్లి తన కుమారుల్ని తన హృదయానికి హత్తుకొని కడుపారా పాలిస్తుంది. తరువాత తానే ఎత్తుకొని ముద్దాడిస్తూ అన్ని చూపిస్తుంది. మధ్యలో భయంకర వస్తువులు తానే చూపిస్తుంది. కాని అప్పుడు మనకు భయం ఉండదు. తల్లి హృదయంలో తలదాచుకొని ఉండవచ్చును; అని మనకు విశ్వాసం ఏర్పడుతుంది. దేవి ఉపాసనలో కూడ సాధనలో అక్షరాలా ఇలాగే జరుగుతుంది. మనం తల్లిపాదాలవద్దకు వచ్చి కూర్చుని ఉంటే ఆమెయే మనల్ని హృదయస్థానానికి చేర్చుకుంటుంది. ఈ చెప్పిన విషయాల్లో పాలు అంటే 'స్వచ్ఛమైన స్వభావం' అని తల్లిపాదాలు అంటే దేహము దేహభావము అని హృదయము అంటే ప్రాణము హృదయభావమైన ప్రేమ అని మనం గుర్తిస్తే యోగ సాధనలో మూలాధారనుండి అనాహతం వరకు అనాయాసంగా వచ్చేసినట్టు. ఇక్కడితో మన కష్టాలు గట్టెక్కుతాయి. లేకపోతే గట్టుమీంచి కింద పడతాయి.

ఇక్కడ గట్టు అంటే పర్వతం అని అర్థం. అందుకే అనాహతచక్రం పర్వతం వంటిది. అని సాధకులు చెప్పుతారు. దీనికి సంకేతంగానే అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని అణచడం. వసురాజు కోలాహల

విశ్లేషణను చేయడం, ఇంద్రుడు పర్వతాల రెక్కలు విరగ్గొట్టడం, మొదలగు కథలుగా పురాణాబుషులు పేర్కొన్నారు. వీటిని గురించి ముమ్ముందు చెప్పుకుందాం. హృదయస్థానమైనటు వంటి అనాహత చక్రం పర్వతం లాంటిది. కాబట్టే దేవీ వక్షోజాలను వర్ణించేటప్పుడు పర్వతాలతో పోల్చి వర్ణిస్తారు. ఆ సంప్రదాయాన్ని మన ప్రబంధ కవులు కావ్యాల్లో అనుసరించారు. ఈ సంప్రదాయాన్నే శివాచార్యులు తమ శిల్ప సంప్రదాయంలో గ్రహించి వక్షోజనిర్మాణంలో జాగ్రత్తవహించారు. ఈ అంశం తెలియకపోతే దేవీ విగ్రహాన్ని చూస్తున్న మనదృష్టిని వక్షోజాలే ఆకర్షింపవచ్చు. వెంటనే కామభావం కల్గవచ్చు. ఇలాగా పతనం ప్రారంభ మవుతుంది. అందువల్ల పసిపిల్లవాడి మాదిరి గానే తల్లి రొమ్ము వద్ద ఉన్న పాలు త్రాగి ఊరుకోవాలి తప్ప ఇతర ఆలోచనలు చేయకూడదు. ఇతర అవయవాల పరీక్ష చేయకూడదు. అంటే చేస్తే ప్రయోజనం ఉండకపోగా ప్రమాదం సంభవిస్తుంది.' పిల్లలు పాలు త్రాగక తల్లిమెడలో హారాలు గుంజడమో, కురులలో ముడిచిన విరులు వెదజల్లడమో వంటి వెకిలి పనులకు పూనుకుంటారు. అటువంటప్పుడు ఆతల్లి బిడ్డను కిందకు దించేసి తను దూరంగా వెళ్ళిపోతుంది. సాధకుల విషయంలో దేవి కూడ ఆలాగే చేస్తుంది. తన హృదయం చేర్చి పాల రూపంలో ప్రేమను అందిస్తున్నప్పుడు అది స్వీకరించి మనం వెకిలి పనులు చేయకూడదు. తల్లి మనం వెకిలి పనులు చేయకుండా ఉంటే ఎత్తుకొని ముద్దాడుతూ అన్న,అక్క, అత్త, మేక, కాకి, కుక్క మొదలైన వాటినన్నింటినీ పరిచయం చేస్తూఉంటుంటుంది. ఆ తరువాతనుండి మనం ఆపరిచయం కొనసాగించాలి. ఆలాగే దేవి హృదయ భావమైన ప్రేమను నింపిమనకు తనవిశ్వరూపాన్ని ప్రదర్శిస్తుంది. అప్పుడు మనం ప్రేమలో అదంరినీ దేవీ అంశలుగా అందరిలోదేవిని చూడగలగాలి. మనలో ప్రేమ లేకపోతే సాటిజీవులనే దూరంగాఉంచి ఆరూపంలో ఉన్న దేవికి మనం దూరం అవుతాం. ఇదే జీవితంలో జరిగిన కొందరు వ్యక్తులు' దేవుని ఉపాసించువారు పెండ్లాడరాదు' అని భావింతురు.

మరికొందరు దేవి అనుగ్రహించిన హృదయసంబంధమైన ప్రేమను దేహసంబంధమైన కామముగా పొరపడి పతనమవుతారు. అంటే సహజమైన దేహస్థితి కంటె అసహజమైన దేహబలహీన స్థితికి దిగజారుతారు. అంటే దేవి తల్లిలాగా పిల్లలవంటి సాధకుల్ని కిందకు దించేసిందన్నమాట. ఈ రకమైన పతనం మనం పొందకుండా సుస్థిరమైన జీవితం సరళ సుందరంగా గడపాలంటే దేవిపాదాలనే మనం ఆశ్రయించాలి. అక్కడే మనఆరాధన చేయాలి, దీన్నే శ్రీశంకరాచార్యుల వారు 'సౌందర్యలహరి' అనే దేవీస్తుతిలో త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ దేవీపాదధూళితో సృష్టి స్థితిలయాలు నిర్వహిస్తూ ఆమెను ఆరాధిస్తున్నారు అని వర్ణించారు. ఆ తరువాత అందరికీ అభయము, వరాలు యిచ్చేటందుకు దేవీపాదములే నిపుణములు అని దేవిపాదవర్ణనతో స్తుతి ప్రారంభించారు. ఈ సంప్రదాయాన్నే దేవీప్రత్యంగోపాసనకు ప్రత్యామ్నాయంగా నాయికావర్ణన చేసే పరిపాటిగల ప్రబంధకవులు వసుచరిత్రాది ప్రబంధాల్లో ఆపాదమస్తకమైన వర్ణనా సంప్రదాయాన్ని స్వీకరించారు. గిరికాదేవి అంటే దేవి' యని, ఆమె చెలికత్తె మంజువాణి అంటే మన నుండి వెలువడే వాక్కేయని సహృదయులు గమనిస్తే ఆపాదమస్తకవర్ణన పద్ధతిలోని సంప్రదాయం బోధపడుతుంది.

# తెలుఁగు రుబాయీలు

"కవిగణపతి"

ఆమె కెడగూడి విహరించునతఁడు మరుడు
ఆమెయధరామృతము గ్రోలునతడమరుడు
ఆమెతోగూడి సయ్యాటలాడికూడ
సతము విరహసంతప్తుఁడౌనతడు నరుఁడు.

ఆమె యెదురైనచో శశినసలె తలఁప
ఆమె తాకుచో తనుగాలినసలె తలఁప
ఆమెతోనున్న సమయమ్మునందు నేను
పొసఁగు ప్రేమ కవిత్వము నసలె తలఁప.

ఎడఁదనుంకువగా ఆమెకీయనుంటి
ఇల్లడమ్ముగ నాదుమే నీయనుంటి
చూచితాఁకి వానిని చాన నాఁచికొనియె
ఇప్పుడిఁక నేను ఆమెకే మీయనుంటి?

చానరంభయేని కనకశక్తితోలఁగు
చావుమీఁద నేని మిగులసక్తి కలుగు
మధువులేని దినము త్రాగుమానవునకు
ముంతెఁడైన దొరకనేని ముక్తికలుగు.

* ఉర్దూలో రుబాయీల పేర కవిత్వమున్నది. ఆ ఛందమునకు మన తెలుగులోని తేటగీతులకు మాత్రలసామ్యమున్నది. రదీఫ్, ఖాఫియా నియమములతో తేటగీతులలో ఆంధ్రసాహిత్యమున వ్రాయబడిన తెలుగు రుబాయీలు ఇవి.

# ఈ పక్షంలో

## వైరభక్తి ఆవిష్కరణ సభ

డిసెంబరు 18 తేదీ సోమవారం సాయంకాలం రాజమండ్రి మార్కండేయేశ్వరస్వామి ఆలయసమీపంలోని ఆర్య వైశ్యయువజన సంఘ కార్యాలయంలో సాహిత్య గౌతమి యాజమాన్యమున సభ జరిగినది. సభకి శ్రీ మడెక్కరాల కృష్ణమాచార్యులవారు అధ్యక్షత వహించిరి. సభకు పెక్కుమంది విద్వాంసులు మున్నగువారు వచ్చి శోభకలిగించిరి.

ప్రకటించిన కాలమునకు రమారమి ఒక గంట ఆలస్యముగా వేదపఠనము కావింపబడి అనంతరము సభ ప్రారంభింపబడినది. మూర్తీభవించిన వేదస్వరూపులు, వక్తలు, ఆశీఃప్రదాతలు, సభావేదికపై ఆసీనులయి యుండగా అధ్యక్షుల మంత్రపఠనంతో సభ ఆరంభమైనది. పండితుల వేదపఠనంతో సభ మార్మ్రోగిన తర్వాత అధ్యక్షుల మంత్రపఠనంలోని అపస్వరస్ఫూర్తిలేశము తత్‌జ్ఞులకు కించిత్ క్లేశకరమయిన దనవచ్చును.

విద్వత్కవులు శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, శ్రీ రామకృష్ణ చెట్టిగారు, శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు, శ్రీ యస్. రామాచారిగారు శ్రీ యస్. టి. వి. పి. కోనప్పాచార్యులుగారు, శ్రీ చేబోలు చిన్మయబ్రహ్మకవి, ఎం.ఏ.గారు ప్రసంగించినారు.

అధ్యక్షులు రామకృష్ణచెట్టిగారి వైశిష్ట్యాన్ని వివరించిరి. చమత్కారోక్తులతో అంతటి ప్రసంగములపైని సంక్షేపవిమర్శ గావిస్తూవచ్చిరి. శ్రీ చెట్టిగారు శర్మగారు పారమార్థిక గ్రంథరచన గావించుటను మెచ్చుకొనిరి. పౌరాణికపాత్రల గుణశీల పరిశీలన గావించిరి. శ్రీ సత్యనారాయణశాస్త్రిగారు సభా ప్రారంభంచేస్తూ వైరభక్తిలోనిబీజాక్షరసంఖ్యానియమాది విశేషముల పరామర్శ గావించి అభినందించిరి.

శంకరకృపాసంపాదకులు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు స్వవిషయాలనుగూర్చి సుదీర్ఘప్రసంగం చేసిరి. సన్మాన సారథి శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యంగారి భక్తిప్రపత్తుల నతిమాత్ర ప్రేమతో ప్రస్తుతించిరి. శ్రీ జమదగ్నిశర్మగారికి శ్రీ సుబ్రహ్మణ్యంగారికి మహాకవుల యాశీస్సులందించిరి. శ్రీ కోనప్పాచార్యులుగారు గ్రంథకర్తకు తమకుగల పరిచయమును విశదీకరించిరి. శ్రీ యస్. రామాచారి జమదగ్నిశర్మగారి కవితారీతిని చక్కగా ఉదాహరణపూర్వకంగా ప్రశంసించి పద్యపఠనంతో సభని రంజింపజేసిరి. శ్రీ చిన్మయబ్రహ్మకవిగారును అదేవిధమున పద్యములు పఠించిరి. శ్రీ రేమెల్ల సూర్యప్రకాశశాస్త్రిగారు, శ్రీ విశ్వనాథ జగన్నాథ ఘనాపాఠీగారు శ్రీ లంక నరసింహశాస్త్రిగారు వైరభక్తి గ్రంథరచయితను ఆశీర్వదించిరి.

శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యంగారు రచయితను, సభాధ్యక్షులను, వక్తలను, పండితవరేణ్యులను నూతన వస్త్రములతో ఘనముగా సన్మానించిరి. శ్రీ జమదగ్ని శర్మగారు తమకు జరిగిన సన్మానమునకు ప్రశంసలకు సమాధానమొసగుచు 'గ్రంథమును బాగాచదివి గ్రంథస్థవిషయమును గూర్చి వక్త లెక్కువగా ప్రస్తావించి యుండవలసిన' దనిరి. రాత్రి 10 గం॥లకు సభ జయప్రదముగా ముగిసినది.

## రచయిత్రీ సమ్మేళనము

రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్బు దశా[...] ఉత్సవసందర్భమున 17-12-78 సాయం[...]కాలం దుర్గాకల్యాణమండపంలో సర[...]స్వతీ దర్బార్ (రచయిత్రీ సమ్మేళనము[...] భువనవిజయం వంటిది- నిర్వహింపబడినది. శ్రీమతి వేలూరి కామేశ్వరి వాగ్దేవిగా శారదాపీఠాన్ని అధిష్ఠించిరి. అష్టావధాని శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రిగారు బృహస్పతిగా వ్యవహరించి సభా కార్యక్రమమును నిర్వహించిరి.

శ్రీమతి డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ మధురవాణిగాను, శ్రీమతి సత్యవాడ ఇందిరాదేవి రంగాజమ్మగాను, కుమారి ఓగోటి ఉషముద్దుపళనిగాను, శ్రీమతి వేదుల మీనాక్షిగంగాదేవిగాను, శ్రీమతి కోడూరి లీలావతి వెంకమాంబగాను, శ్రీ అద్దేపల్లి వివేకానందదేవి మొల్లగాను, శ్రీమతి సుసర్ల సుశీలాదే[...]

కనుపర్తి వరలక్ష్మమ్మగాను, శ్రీమతి ప్రేమకుమారి మీరాగాను పాత్రపోషణ గావించి సభను మిక్కిలి రంజింపజేసినారు. పద్య (శ్లోక) పఠనమూ, సమస్యాపూరణమూ అన్యూనాతిరిక్తముగా జరిగి, సభాసదుల ప్రశంసల నందుకొన్నవి. సభా కార్యక్రమము క్రమశిక్షణ యుతముగా సకాలములో చక్కగా జరిగినది. ఈ మధ్య జరిగిన సాహిత్యసభలలో అత్యుత్తమముగా జరిగినసభ యిది యనుటలో అతిశయోక్తి లేదు. స్త్రీల నిర్వహణలో ఇంత జయప్రదముగా సభ జరుగుట మిక్కిలి ప్రశంసార్హము. ఇంచుమించుగా ఇందు పాల్గొన్నవారందరూ సాహిత్యలోకంలో ప్రసిద్ధివహించినవారు. సభలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారికి ప్రత్యేకముగ గొప్ప సన్మానం జరిగినది. దర్బారులో పాల్గొన్న రచయిత్రులందరికీ క్లబ్బువారు నూతనవస్త్రము లొసగి సన్మానించిరి. శ్రీమతి గీతామహేశ్వరి వందన సమర్పణముతో సభ ముగిసినది.







## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకారము మొసగుచున్నందుకు సంతోషము. రచన అతిదీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.


అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్ము వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును.

— సంపాదకుడు 'సమాలోచన'

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.